పుట్టిన రోజు నాడు
నా సోదరుడి
కానుక నాకు...

# అతను **యూకోబ్యాంకులో** పొదుపు చేసిన చేతి ఖర్చుతో

ఎంత మంచివాడు నాకోసం కొని తెచ్చాడు ఈ ట్రాన్సిస్టర్! అతను యూకోబ్యాంక్‌లో పొదుపు చేసిన చేతి ఖర్చుతో.

ఇక్కడే డబ్బు అధికమౌతుంది. ఎందుకంటే మీ డబ్బు వారి వద్ద వుంచినందుకు గాను వారు మీకు కొంత మొత్తాన్ని అందిస్తారు. దీనినే వారు **వడ్డీ** అంటారు.

మీ చేతి ఖర్చును అధికంగా చేసుకొనేందుకు ఇది ఒక ఆనందదాయకమైన పద్ధతి. ఔను కదూ?



**యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్**
మీకు దగ్గరలోవున్న మంచి సదుపాయాలున్న బ్యాంక్

UCO/CAS-109/82 TEL

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికేట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని <u>పూర్తిగా</u> కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి ఉత్తర వ్యవహారాలు జరుపబడవు.

Name:........................ ........................................................Age:..........................

Address:..............................................................................................................

..........................................................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: *31—12—1982*

**CONTEST NO 27**

VISION Tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

"విఘ్నేశ్వరుడు" రంగుల సీరియల్, యీ సంచికలో పూర్తి అవుతున్నది. దీని రచన వడ్డాది పాపయ్య. వచ్చే సంచికలో, "విష్ణుకథ" ప్రారంభమవుతుంది.

ఈ నెల బేతాళకథ ["ఉత్తమ లోభి"]కి ఆధారం "వసుంధర" రచన.

## అమరవాణి

యస్మిన్ జీవతి జీవంతి, బహవః స తు జీవతు,
కాకోపి కిం న కురుతే, చంచ్వా స్వోదర పూరణమ్.

[ఎవడు జీవించివుంటె చాలామందికి సుఖజీవనం లభ్యమవుతుందో, వాడు జీవించి వుండాలి. అంతేగాని, కాకి లాగా తన పొట్ట నింపుకోడమే సర్వం అనుకునేవాడు నూరేళ్ళు జీవించినా నిష్ప్రయోజనం.]

సంపుటి 71 డిసెంబర్ '82 సంచిక 6

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00





# కనిపించని పిశాచం

గోపాలం రోజూ ఉదయానే చిట్టడవి దాటి, పట్నంలో ఉద్యోగం పనులు చూసుకుని, రాత్రికి స్వగ్రామం చేరుతూండేవాడు. తను సంపాయించే కొద్దిపాటి జీతం డబ్బుతో పట్నంలో కాపరం పెట్టడం అతడికి సాధ్యం కాలేదు.

ఆ రోజు అతడు చిట్టడవి దాటుతూండగా, కాలిబాటకు యిరుపక్కలా వున్న చెట్ల కొమ్మల్లో ఒక కోతుల మంద చేరి, నానా గొడవా చేస్తున్నది. వాటిని చూస్తూనే గోపాలం భయపడిపోయి, కాలిబాట నుంచి తప్పుకుని, దారీ తెన్నూలేని చిట్టడవిలో చాలా దూరం నడిచాడు. ఆసరికి సూర్యాస్తమయి, చీకట్లు అలముకుంటున్నవి.

హఠాత్తుగా గోపాలానికి ఒకచోట సగం వరకూ నల్లగా కాలిపోయిన చెట్టొకటి, మోడుబారిన కొమ్మలతో పిశాచంలా వికృతంగా కనిపించింది. అతడికి పిశాచాలంటే మహా చెడ్డ భయం. కాని, వాటిలో కొన్ని హానిచేయకపోగా, మేలు చేయగలవని అతడు విని వున్నాడు.

వికృతంగా వున్న చెట్టును చూసి పిశాచం అనుకున్న గోపాలానికి యిప్పుడు, ఆ చెట్టును ఏదో పిశాచం ఆశ్రయించి వున్నదన్న నమ్మకం కలిగింది.

అతడు రెండు చేతులూ జోడించి, "ఓ పిశాచమా! నేను పొద్దుననగా, యీ చిట్టడవిలో దారితప్పి తిరుగుతున్నాను. నాకు హాని చేసినందువల్ల నీకు కలగబోయే లాభం ఏమీలేదు. అలాకాక, యీ పేదవాడికి యింత ధనం యిచ్చావో, నీ పేరు కలకాలం చెప్పుకుని సుఖంగా బతుకుతాను," అన్నాడు.

అతను మాట పూర్తి చేసేంతలో చెట్టు తొర్ర దగ్గిరఏదో అలికిడి అయింది. గోపాలం

మాచిరాజు కామేశ్వరరావు

ధైర్యంగా చెట్టును సమీపించి, తొర్రలోకి చూశాడు. అతడి కళ్ళు చెదిరిపోయాయి. తొర్రలో కుప్పగా బంగారు కాసులు!

గోపాలం ఆత్రంగా వాటిని పైపంచలో మూట గట్టుకుని, యీసారి దూరంగా వున్న ఎత్తయిన చెట్లూ, గుట్టలూ గుర్తులు చూసుకుంటూ ఇంటిదారి పట్టాడు. అతడు ఇల్లు చేరేసరికి రాత్రిలో మొదటి జాము గడిచిపోయింది. అతడు తలుపు తట్టగానే భార్య గోమతి తలుపు తెరిచి, "ఇంత ఆలస్యంగా వస్తున్నారేం?" అని అడిగింది.

"ఆ సంగతి తరవాత చెబుతాను, ముందు కాస్త మంచినీళ్ళు తీసుకురా," అన్నాడు గోపాలం విసుగ్గా.

భార్య వంట గదికేసి వెళ్ళింది. ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదు, అనుకుంటూ గోపాలం బంగారు కాసులున్న మూటను అటక మీదికి గిరవాటు వేశాడు. ఆ తరవాత, ఆ మూటలో ఎంత ధనం వున్నదో అని ఆలోచిస్తూ, అయిష్టంగానే భోజనం ముగించి పడుకున్నాడు. కాని, ఎంతకూ అతడికి నిద్ర పట్టలేదు.

"మీరు వచ్చినప్పటి నుంచీ, అదోలా వున్నారు. సంగతేమిటి?" అన్నది భార్య.

"ఏ సంగతులేవు. నువ్వు నోరు మూసుకు పడుకో," అంటూ గోపాలం భార్యను గట్టిగా కసిరాడు.



ఏనాడూ పల్లెత్తు మాట అనని భర్త యిలా కసురుకునేసరికి, గోమతికి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

తెల్లవారి గోపాలం పట్నం వెళ్ళాడు. కాని, అతడు ఉద్యోగానికి పోక, రకరకాల వ్యాపారాలను గురించి ఎరిగినవాళ్ళను అడిగి చూశాడు. ప్రతి ఒక్కరూ వ్యాపారానికి చాలా పెద్ద పెట్టుబడి అవసరం అని చెప్పసాగారు. ఈ విధంగా అతడు వారం రోజులపాటు ఉద్యోగానికి వెళ్ళక, తిరిగి, తిరిగి మరింత డబ్బు అవసరం అన్న నిర్ణయానికి వచ్చాడు.

ఒకనాడు చీకటి పడుతున్న వేళ గోపాలం చిట్టడవిలోని పిశాచి చెట్టు

అతడిక ఆశగా వున్నది. కాని, భార్య ఇంటవున్న కారణంగా గోపాలానికి ఆ అవకాశం చిక్కడం లేదు. ఇక డబ్బు మొత్తం లెక్క చూసి, ఏదో ఒక వ్యాపారం ప్రారంభించాలనుకున్న గోపాలం, భార్యతో, "రేపు నువు, మీ పుట్టింటికి వెళ్ళు," అన్నాడు.

ఆ మాటకు గోమతి భోరుమని ఏడుస్తూ, "నీలో యీ మధ్య యింత మార్పు రావడానికి ఏదో పిశాచమే కారణమయి వుంటుంది!" అన్నది.

ఏమి చేయాలో తెలియని చీకాకుతో గోపాలానికి ఆ రాత్రి ఎంత పొద్దుపోయినా కునుకు పట్టలేదు. తీరా కొంచెం కునుకు పడుతూండగా గదిలో ఏదో అలికిడి అయింది. ఎదురుగా నాలుగు పిశాచాలు!



"మా నేస్తం నుంచి చాలా ధనం పుచ్చుకున్నావు. సమయానికి వాడు రాలేదు ; మాకైనా మంచి విందు భోజనం ఏర్పాటు చెయ్యి," అన్నవి పిశాచాలు.

"విందు భోజనమా? ఆట్టే గొడవ చెయ్యకుండా వెళ్ళిపొండి. మా ఆవిడకు పిశాచాలంటే తగని భయం," అన్నాడు గోపాలం కోపంగా.

ఆ జవాబుతో పిశాచాలు రెచ్చిపోయి, ముందు ఇంట్లో వున్న వస్తువులన్నిటినీ చిందరవందర చేశాయి. తరవాత అటక దగ్గిరకు పోయి, చేతులు జోడించి, "నువ్విచ్చిన ధనాన్ని ఏం చేయాలా అన్న ఆలోచనల్లో మునిగి, సెలవు కూడా పెట్టకపోవడంతో, నా ఉద్యోగం పోయింది. మరికొంత ధనం యిచ్చి నువ్వే నన్ను ఆదుకోవాలి," అన్నాడు.

ఈసారి గోపాలం తొర్రలోకి తొంగి చూస్తే, లోగడ అతడికి దొరికినదాంట్లో సగానికి కొంచెం తక్కువగా మాత్రమే బంగారు కాసులు దొరికినై. దాన్ని కూడా భార్య కళ్ళపడకుండా గోపాలం అటక మీదికి విసిరివేశాడు.

ఇంతవరకూ తనకు దొరికిన బంగారు కాసులన్నీ కుప్ప పోసి లెక్క పెట్టాలని

అంటూ తొర్ర దగ్గిరకు పోయి, లోపల బాధతో మూలుగుతున్న వాణ్ణి చూస్తూనే, "ఒరే, నువ్వా గంగులూ! ఆ మధ్య జమీందారుగారింట దోచిన డబ్బు ఎక్కడ దాచావు?" అంటూ వాణ్ణి మెడ పట్టుకుని బయిటికి లాగారు.

ఆ వెంటనే తొర్ర వెనక వున్న పెద్ద కలుగులోంచి పందికొక్కొకటి బయిటికి వచ్చి, పొదల్లోకి పారిపోయింది.

గోపాలం దాన్ని చూసి ఆశ్చర్యపోతూ, జమీందారు నౌకర్లతో, "తన కలుగుకు అడ్డం పడిన బంగారు కాసుల్ని పంది కొక్కు తొర్రలోకి చేరవేస్తున్నదన్నమాట! నేనిదంతా ఏదో పిశాచం పని అనుకున్నాను," అన్నాడు.

నౌకర్లలో ఒకడు కోపంగా గోపాలంతో, "ఏదో కట్టుకథ అల్లి పారిపోవాలని చూస్తున్నావా? జమీందారుగారి దేవిడీ దోచి, దాన్నంతా యిక్కడ చెట్టుతొర్రలో దాచిన వాళ్లు నువ్వూ, గజదొంగ గంగులూ. పదండి జమీందారుగారి దగ్గిరికి!" అన్నాడు.

జమీందారు నౌకర్లు చెట్టు తొర్రలో వెతకగా బంగారంతోపాటు, కొన్ని విలువైన నగలు కూడా దొరికినై. వాళ్ళు గంగుల్నీ, గోపాలాన్నీ జమీందారు దగ్గిరకు తీసుకుపోయారు.

జమీందారు పాత నేరస్థుడైన గంగుల్ని ఖైదుకు పంపి, గోపాలాన్ని ప్రశ్నించగా, అతడు జరిగినదంతా చెప్పాడు.

"నీ వల్లే పోయిన డబ్బంతా దొరికింది. అందులో నీకాక్కవలసినదేదో తీసుకో," అన్నాడు జమీందారు.

గోపాలం ఆయనతో, "ప్రతిమనిషి లోనూ డబ్బాశ అనే కనిపించని పిశాచం వుంటుంది. ఈ అనుభవం తరవాత, దాన్ని ఎలా అదుపులో పెట్టాలో తెలుసుకున్నాను. ఏదైనా చిన్న ఉద్యోగం యిప్పించండి చాలు," అన్నాడు.

ఆ జవాబుకు సంతోషించిన జమీందారు, గోపాలానికి దేవిడీలో లెక్కలు రాసే గుమాస్తా ఉద్యోగం యిచ్చి ఆదరించాడు.






## 14

[శివదత్తుడూ, మందరదేవుడూ వున్న పడవలు రాత్రివేళ ఒకానొక ద్వీపాన్ని చేరినై. ఎక్కడినించో హఠాత్తుగా రివ్వుమంటూ వచ్చి, ఒక రాయి సైనికుణ్ణి తాకింది. మందరదేవుడు అటుకేసి బాణం వదిలాడు. వెంటనే వికృతమైన కేక వినబడింది. తెల్లవారి ఆ ప్రదేశంలో అక్కడక్కడా పచ్చని చెట్లఆకులపై, ఎర్రని నెత్తురు మరకలు కనిపించినై. తరవాత——]

శివదత్తుడూ, మందరదేవుడితో పాటు సైనికులు కూడా, ఆకులపై కనిపించిన ఎర్రని నెత్తురు మరకలను చూసి, నిర్విణ్ణులైపోయారు. రాత్రి వినబడిన వికృత కంఠధ్వని, మనిషిదే అయివుంటుందని, అందరికీ అర్థమైపోయింది.

"ఇగో, మానవరక్తం, సందేహంలేదు!" అన్నాడు శివదత్తుడు, వాటిని పరీక్షించి చూస్తూ. "నేను అనుమానించినట్టు వాడు గాయపడ్డాడే గాని మరణించ లేదు. ఇక్కడినుంచి పారిపోయి వుంటాడనేందుకు కూడా సందేహం లేదు. ఎందుకైనా మంచిది, మనం యీ చుట్టుపక్కల వెతికి చూద్దాం."

మందరదేవుడూ, ముగ్గురు సైనికులూ ఒక వైపుకూ, శివదత్తుడూ మిగిలిన ముగ్గురు సైనికులూ మరొక వైపుకూ బయలుదేరారు. మందర దేవుడు కొంత

దూరం వెళ్ళేసరికి ఎదురుగా వున్న పొదలో ఏదో కదిలిన అలికిడి అయింది. వెంటనే అతడికి తను వెతుకుతున్న శత్రువు దొరికినట్టనిపించి, ముందుకు దూకాడు. కాని, ఆ అలికిడి చేసింది మనిషి కాదు; ఒక అడవి పంది. అది అరుస్తూ మందర దేవుడిని తన కోరలతో చీల్చేందుకు పొద లోంచి బయటకు దూకింది. మందర దేవుడు అంతలో నివ్వెరపోయి, దాని కోరలనుంచి పక్కకు తప్పుకుని, కత్తితో దానిని ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు అడవిపంది బాగా గాయపడినా, అరుస్తూ వెనక్కు తిరిగి అతడిమీదికి ఉరికింది. ఈ లోపల మందరదేవుడి వెంట వున్న సైనికులు దానిని తమ కత్తులతో పొడిచారు. అది ఘీంకరిస్తూ పక్కకు పడి గిలగిల తన్నుకోసాగింది.

ఇంతలో శివదత్తుడు సైనికులతో పరిగెత్తుతూ అక్కడికి వచ్చాడు. అతడికి గాయపడి తన్నుకుంటున్న అడవిపందీ, పక్కనే నిలబడివున్న మందరదేవుడూ కనిపించారు. "మీ కేకలు విని ఏదో ప్రమాదం జరిగిందని, పరిగెత్తుకుంటూ వచ్చాను," అన్నాడు శివదత్తుడు నవ్వుతూ.

"అనుకోకుండా ఆహారం సంపాదించాం. రాత్రి మనమీదకు రాయి విసిరిన శత్రువెవడో తర్వాత చూసుకోవచ్చు. ముందు ఆకలి తీర్చుకోవటం అవసరం," అన్నాడు మందరదేవుడు.



సైనికులు ఆ చుట్టుపక్కల దొరికే ఎండుపుల్లలు పోగుచేసుకు వచ్చేందుకు తలా ఒక వైపుకు వెళ్ళారు. మందర దేవుడూ, శివదత్తుడూ నిప్పు వెలిగించి మంట చేస్తున్నారు.

అంతలో దూరాన్నుంచి వాళ్ళ కర్ణ పుటాలు బద్దలయేలాంటి భయంకర ఆర్తనాదం వినబడింది.

ఆ శబ్దం వింటూనే ఒక్క గంతున శివదత్తుడూ, మందరదేవుడూ లేచి, కత్తులు దూసి ఆ ఆర్తనాదం వచ్చిన వైపుకు పరిగెత్తారు.

కొంచెం దూరం వెళ్ళేసరికి ఒకచోట వాళ్ళ కంటబడిన దృశ్యం, భయాశ్చర్యాలను కలిగించింది.

అంతలో, "నరవానరం! నరవానరం!" అని కేకలు వేస్తూ కొందరు సైనికులు అటుకేసి పరుగెత్తుకుంటూ వచ్చారు.

ఇంతకూ అక్కడ జరిగినదేమిటంటే, ఎండుపుల్లలు ఏరుతున్న ఒక సైనికుడి కంఠాన్ని హఠాత్తుగా వెనుకనుంచి రెండు బలమైన చేతులు పట్టుకున్నాయి. భయ కంపితుడై ఆ సైనికుడు ఓపికకొద్దీ గొంతెత్తి కేకలు పెట్టాడు.

"ఇది నరవానరం, సందేహం లేదు!" అంటూ మందరదేవుడు కత్తితో ఆ వికృతాకారాన్ని పొడిచేందుకు ముందుకు వురికేంతలో, "ఆగు, మందరదేవా! ఆగు!" అంటూ శివదత్తుడు వెనుకనుంచి కేకలు వేశాడు. అంతలో సైనికుడి





కంఠాన్ని చేతులతో బిగించిన వికృతాకారం వెనక్కు తిరిగి పారిపోయేందుకు ప్రయత్నించింది. వెంటనే ముగ్గురు సైనికులు దానిమీద కలియపడి పెనుగులాడి దాన్ని అడవితీగలతో కట్టి బంధించారు.

"ఇది నరవానరం కాదు, నూటికి నూరు పాళ్ళు మానవప్రాణి! ఏదో దురదృష్ట సంఘటన యితణ్ణి ఈ నీచస్థితికి తెచ్చింది," అన్నాడు శివదత్తుడు.

వెంటనే ఒక సైనికుడు ఆశ్చర్యంగా చూసి, "శివదత్తా, చూడండి! ఈ నరవానరం కుడిచేతికి పెద్ద గాయం తగిలి, నెత్తురు కారుతున్నట్టు కనబడుతున్నది!" అంటూ అరిచాడు.

మందరదేవుడు వంగి, ఆ వికృతాకారుడి చేతిని పరీక్షగా చూసి, "శివదత్తా, రాత్రి మనమీదకు రాయి విసరిన ప్రాణి యిదే! ఇదుగో, నా బాణం యిక్కడ యితడి చేతిని తాకింది. మీరన్నట్టు యిది నరవానరం కాదు; నరుడే!" అన్నాడు.

ఇప్పుడు ఆ వికృతాకారుడు బాధతో మూలుగుతూ, "నేనూ మీలాంటి మానవుణ్ణే! ఈ భయంకర ద్వీపంలో పన్నెండు సంవత్సరాలు ఒంటరి జీవితం గడిపి యిలా అయ్యాను!" అన్నాడు

"నీపేరేమిటి? పన్నెండు సంవత్సరాలు ఒంటరిగా యీ ద్వీపంలో కాలం గడపవలసిన అవస్థ నీకెందుకు కలిగింది?" అని శివదత్తుడు అడిగాడు.

శివదత్తుడి ప్రశ్న వింటూనే, ఆ వికృతాకారుడు, ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నవాడిలా ముఖం చిట్లించి, కొంచెం సేపు మెదలకుండా వూరుకుని, యిలా చెప్పాడు:

"అయ్యా, నా పేరు వజ్రముష్టి! మాది శమనద్వీపం. నాకు పద్దెనిమిదో ఏడు ప్రవేశించి నప్పటినించీ, సముద్రకేతు అనబడే ఒక క్రూర సముద్రపు దొంగల నాయకుడి కింద పనిచేసేవాణ్ణి. సముద్రం మీద ప్రయాణించే వర్తక నౌకలనూ, తీర గ్రామాలనూ దోచుకో

ఎటం. మా పని. కొంతకాలం అలా జీవితం గడపిన తర్వాత, నాకూ, నాయకుడైన సముద్రకేతుకూ వివాదం వచ్చిన కారణంగా, అతడు నన్నీ ద్వీపంలో ఒంటరిగా విడిచిపోయాడు. ఆనాటి నుంచీ నరకయాతన అనుభవిస్తున్నాను.''

''నీది శమనద్వీపమా?'' అంటూ శివదత్తుడు వజ్రముష్టి మాటలకు చాలా ఆశ్చర్యపోయాడు. శమనద్వీప మనగానే, శివదత్తుడికి, శాక్తేయుడి సంగతీ, అతడు వెండి బంగారాలతో చండీదేవికి దేవాలయం కట్టించేందుకు, యితర రాజ్యాల మీద దాడికి బయలుదేరిన సమాచారం గుర్తుకొచ్చింది. శమనద్వీపం ఎక్కడున్నది? ప్రస్తుతం ఆ రాజ్యానికి రాజెవరు? ఇలాంటి ప్రశ్నలకు వజ్రముష్టి నుంచి సమాధానాలు రాబట్టవచ్చునని శివదత్తుడికి తోచింది. కాని, అందుకు అది తగిన సమయం కాదనుకున్నాడు. ప్రస్తుతం కావలసింది; తను చేరిన ద్వీపం, అక్కడి స్థితిగతుల సంగతి.

''వజ్రముష్టీ! నువ్వీ ద్వీపంలో పన్నెండు సంవత్సరాల నుంచి వుంటున్నావు గదా? ఇక్కడ నివసించే జనుల గురించీ, వాళ్ళ ఆచారవిశేషాల గురించీ నీకు బాగా తెలుసుననుకుంటాను!'' అన్నాడు శివదత్తుడు.




వజ్రముష్టి నిస్పృహగా తల ఊపాడు. ''అయ్యా, యిన్ని సంవత్సరాలనుంచీ, నేనిక్కడ వుంటున్నా, నాకు యీ ద్వీపాన్ని గురించి అంతగా తెలిసిందేమీ లేదు. ఆహార సంపాదనకూ, క్రూర మృగాల నుంచి తప్పుకుని బతికేందుకూ చేసే ప్రయత్నంలో నా కాలమంతా వెళ్ళబుచ్చాను. ఒకటి రెండుసార్లు మాత్రం, సముద్రకేతుడి ఓడదొంగలు యీ తీరం వెంట వెళ్ళటం నా కంటబడింది. అంతకన్న నాకేమీ తెలియదు.''

''ఈ ద్వీపంలో యింతవరకూ నీకు మానవమాత్రుడే కనబడలేదా?'' అంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శివదత్తుడు.




వజ్రముష్టి ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్నవాడిలా తల వూపి, "ఈ పన్నెండు సంవత్సరాల కాలంలో, సుమారు నాలుగైదుసార్లు మనుషులను చూశాను. వాళ్ళు ఆజానుబాహులు; వేటగాళ్ళు. తల మీద పెద్ద పెద్ద కొమ్ములను ధరిస్తారు. వాళ్ళ నివాసం మాత్రం ఈ దావులలో కాదు. వేట ముగించుకుని ఎక్కడికో వెళ్ళిపోతారు," అన్నాడు.

శివదత్తుడు, మందరదేవుడి కేసి సాభిప్రాయంగా చూశాడు. మందరదేవుడు నవ్వి, "శివదత్తా! మనం, ప్రస్తుతానికి ఏదో విధంగా ఈ ద్వీపంలో నివసించక తప్పదుగదా? కనుక, యీ చుట్టుపట్ల పరిశోధించి, ఎలాంటి ప్రదేశంలో వున్నామో తెలుసుకోవటం మంచిది. చీకటి పడకముందే, ఆ పని ముగించుకోవడం అవసరం. తరవాత ఎండ వానల నుంచి రక్షణకు, ఏవైనా చిన్న కుటీరాలు నిర్మించుకుందాం," అన్నాడు.

శివదత్తుడు సరేనన్నట్టు తల వూపాడు. తరవాత సైనికుల కేసి తిరిగి, వజ్రముష్టిని బంధించి వున్న అడవి తీగలను విప్పమన్నాడు. కట్లు విప్పగానే, వజ్రముష్టి శివదత్తుడికీ, మందరదేవుడికీ నమస్కరించి, "అయ్యా, నన్ను కూడా మీ అనుచర వర్గంలో చేర్చుకోండి. విశ్వాసపాత్రుడుగా మీకు సేవ చేయగలను!" అన్నాడు.

శివదత్తుడు తన అనుచరుల కేసి చూశాడు. వాళ్ళందరూ అంగీకార సూచకంగా చేతులు ఎత్తారు. ఇద్దరు ముగ్గురు సైనికులు, వజ్రముష్టిని సమీపించి, స్నేహసూచకంగా అతడి భుజం తట్టారు.

"ముందు ఆకలి చల్లార్చుకోవాలి. తరవాత యీ చుట్టుపక్కల పరిస్థితులేమిటో చూడవచ్చు," అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు తల వూపాడు. సైనికులు పోగుచేనుకువచ్చిన ఎండు పుల్లలన్నీ ఒక చోట పేర్చబడి నిప్పు అంటించబడినై. అంతకు పూర్వం చంపబడిన అడవి పందిని సైనికులు ఎత్తి నిప్పులో పడ వేశారు. వజ్రముష్టి కాసేపు ఆ కాల్చ బడుతున్న అడవిపంది కేసి చూసి, "అయ్యో! ఇది ఒక్కటే మనందరి ఆకలి తీర్చేందుకు సరిపోదనుకుంటాను మీరు అనుమతించితే, నాలుగైదు నిమి షాల్లో నేను మరేదైనా జంతువును పట్టుకు రాగలను," అన్నాడు.

మందరదేవుడూ, శివదత్తుడూ అనుమ తించారు. వజ్రముష్టితోపాటు, ఇద్దరు సైనికులు కూడా విల్లంబులు తీసుకుని బయలుదేరారు. అడవిలో కొంతదూరం వెళ్ళిన తరవాత వారికి ఒక చోట నాలు గైదు లేళ్ళు మేస్తూ వుండటం కనిపిం చింది. సైనికులు బాణాలు ఎక్కు పెట్టేంతలో వజ్రముష్టి వారిని వారించుతూ, "ఈ చిన్న జంతువులను పట్టుకునేందుకు మీరు బాణాలను వృధా పుచ్చవద్దు. మీరిక్కడే వుండండి. నేను పని పూర్తిచేసుకువస్తాను!" అంటూ చెట్లచాటున మెల్లగా బయలుదేరాడు.

సైనికులు కూడా నిశ్శబ్దంగా వజ్రముష్టి వెనక నడవసాగారు. వజ్రముష్టి అడుగులో




అడుగు వేసుకుంటూ కొంతదూరం నడిచి, లేళ్ళు వున్న చోటుకు దాపుల వున్న చెట్లను పిల్లిలా ఎగబాకాడు. అతడు ఏమి చేయబోతున్నాడో తెలియని సైనికులు, ఇదంతా వింతగా చూస్తున్నారు. వజ్రముష్టి లేళ్ళకు పైన వున్న చెట్టుకొమ్మల వెంట పాములా పాకిపోయి, హఠాత్తుగా అక్కడి నించి వాటి మీదికి దూకేశాడు.

కనుమూసి తెరిచేంతలో లేళ్లు చెంగున దూకినై. వాటిలో ఒకటి వజ్రముష్టి బల మైన చేతుల్లో తగుల్కొని పారిపోయేం దుకు వృధా ప్రయత్నం చేస్తోంది. వజ్రముష్టి తన చేతుల్లో చిక్కిన లేడిని, సునాయాసంగా భుజాన వేసుకుంటూ,

"ఈ పన్నెండు సంవత్సరాల కాలం, నా ఆహార సంపాదన ఇలాగే జరిగింది. ఈటె, బాణాలు - ఇలాంటివి వాడేందుకు, అవి నా కెక్కడా లభించలేదు. ఒకటి రెండుసార్లు పెద్దపులి నుంచీ, ఎలుగు బంటి నుంచీ, వట్టి చేతులతో పోరాడి ప్రాణరక్షణ చేసుకున్నాను," అన్నాడు.

సైనికులు, వజ్రముష్టి దేహబలాన్నీ, ప్రదర్శించిన తెలివితేటలనూ చూసి చాలా ఆశ్చర్యపోయారు. దాదాపు అయిదు అడుగుల ఎత్తూ, పొట్టికాళ్ళూ, పొట్టి చేతులూ - అతడిలో అంత శక్తి వుంటుం దని మొదట్లో వాళ్ళూహించలేదు.

కొద్దిసేపటి తరవాత, అందరూ తిరిగి శివదత్తుడున్నచోట చేరారు. వజ్రముష్టి లేడిని పట్టిన విధం, సైనికులు చెప్పగా విని, శివదత్తుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

మందరదేవుడు కూర్చున్న చోటు నుంచి లేచి, వజ్రముష్టిని సమీపించి అతడి భుజం తడుతూ, "వజ్రముష్టీ, నువ్వు మా అనుచరుడుగా లభించటం మా అదృష్టం అనుకుంటున్నాను. నీకు సముద్రకేతుడు చేసిన ద్రోహంలాంటిదే, నాకూ నరవాహను డనేవాడు చేశాడు. మన ఇద్దరం పగ తీర్చుకునేందుకే బతకాలి!" అన్నాడు.

"మందరదేవుడు చెప్పినట్టు, నువు మాకు అనుచరుడుగా వుండవలసిన వాడివే. ఈ ద్వీపంలో మేము ఎదుర్కో వలసిన ప్రమాదాలేమైనా వుంటే, అందుకు నువ్వు మా వెంట వుండి సహాయపడగల వనుకుంటాను. ఏదో ఒక రోజున నిన్ను పన్నెండేళ్ళు ఈ భయంకర ద్వీపంలో ప్రవాసిగా చేసిన ఆ ఓడదొంగ సముద్ర కేతుడి మీద నువ్వు పగసాధించుకోగలవని నా నమ్మకం!" అన్నాడు శివదత్తుడు.

"అయ్యా, నేనూ అలాంటి సుదినం కోసమే ఎదురు చూస్తున్నాను!" అని వజ్ర ముష్టి అనేంతలో, సముద్ర తీరం నుంచి వికృతమైన కేకలూ, అరుపులూ వినిపిం చినై. అందరూ ఆశ్చర్యచకితులై అటు కేసి తలలు తిప్పారు. —(ఇంకా వుంది)



# ఉత్తమలోభి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఓర్పు, పట్టుదలకు తోడుగా వివేకం కూడా లేనప్పుడు, మనిషి తాను సాధించినదాన్ని నిలబెట్టుకోలేడు, అది పరుల పాలైపోతుంది. ఈ అర్ధరాత్రివేళ నిన్ను, యిన్ని శ్రమలకు గురి చేస్తున్నవాడు, నీకన్న వివేకవంతుడయితే, వజ్రపురి రాజు లాగా తప్పక నష్టపోతావు. నీకు, అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

వజ్రపురి రాజు చంద్రసేనుడు మారు వేషంలో దేశాటన చేస్తూ, ఒక రాత్రివేళ ఒక చిన్న గ్రామం చేరాడు. అప్పటికి

## బేతాళ కథలు



ఊరంతా నిద్రపోతున్నది. రాజు ఒక ఇంటిముందు ఆగి, తలుపు తట్టబోయాడు.

"నువ్వెవరో పరదేశివి లాగున్నావు! ఆ ఇంటి తలుపులెందుకు తడుతున్నావు?" అన్న స్వరం వినబడింది రాజుకు.

రాజు వెనక్కు తిరిగి చూశాడు. సుమారు పాతికేళ్ళ యువకుడొకడు, ఆయన కేసి పరీక్షగా చూస్తున్నాడు.

"నువ్వెవరు?" అని రాజు, ఆ యువకుణ్ణి అడిగాడు.

"నేనీ ఊరుకు రాత్రివేళ కాపలా కాస్తూంటాను. నువ్వు పరదేశివా, దొంగవా అన్న అనుమానం కలిగింది. ఒకవేళ నువ్వు పరదేశివైతే మాత్రం, ఒక చిన్న హెచ్చరిక చేద్దామనుకుంటున్నాను," అన్నాడు కాపలావాడు.

"అదేమిటో చెప్పు," అన్నాడు రాజు కుతూహలంగా.

"ఆ ఇంట్లోవాడు పరమలోభి. వాడు, ఈ రాత్రి నీకు ఉచితంగా ఆశ్రయం యివ్వడు. కాని, అలా యిచ్చేవాళ్ళు ఊరినిండా చాలామంది వున్నారు. ఇదీ, నీకు చెప్పాలనుకుంటున్నది," అన్నాడు కాపలావాడు.

రాజుకు ఆ లోభి సంగతి తెలుసుకోవాలనిపించింది. వెంటనే ఆయన తలుపు తట్టాడు. మరుక్షణం లోపలి నుంచి, "వస్తున్నాను!" అన్న కేక వినబడింది.

అంత రాత్రివేళ తట్టగానే తలుపు తీసినవాడు లోభి ఎలా అవుతాడన్న అనుమానం కలిగింది రాజుకు.

ఆయన ఎంతో మర్యాదగా, "తమరు గొప్ప దయాస్వభావులని విన్నాను. నేను పరదేశిని. దయచేసి ఈ రాత్రికి తమ ఇంట ఆశ్రయం యిప్పించాలి," అన్నాడు.

"నువ్వు, నా గురించి తప్పుగా విన్నావు. నాలో దయాస్వభావం లేదు. నేను పరదేశులకు ఆశ్రయం యివ్వను," అన్నాడు లోభి నిర్మొహమాటంగా.

"అతిథులకు ఆశ్రయం యివ్వటం కోసం, తమరు రాత్రింబవళ్ళు ఎదురు చూస్తూంటారని అందరూ చెప్పారు. నేను తలుపు తట్టగానే, మీరు వెంటనే పలకడం అందుకు సాక్ష్యం!" అన్నాడు రాజు.

"అదా! నా డబ్బును ఏ దొంగవెధవో దోచుకుపోతాడన్న భయంతో, రాత్రిళ్ళు నాకు సరిగా నిద్రపట్టదు. అందువల్లనే, నీవు తలుపుతట్టగానే నాకు వినిపించింది. పదేపదే తలుపులు తడితే, అవి అరిగి బలహీనపడిపోతాయి. అందుకే వెంటనే తలుపు తీశాను. యిక, నీ దారిన వెళ్ళు." అన్నాడు లోభి.



"ఇంత రాత్రివేళ ఎక్కడికనిపోను? పోనీ డబ్బు తీసుకునయినా ఆశ్రయం యివ్వండి," అంటూ రాజు, లోభికి ఒక బంగారు నాణెం చూపించాడు.

బంగారు నాణాన్ని తీసుకుని లోభి, రాజుకు మంచి పడక ఏర్పాటు చేశాడు. మర్నాడు లోభి బతుకుతున్న తీరు చూసి, రాజుకు చాలా బాధకలిగింది.

లోభి దొడ్లో పళ్ళచెట్లున్నాయి. అతడికి రెండావులూ, రెండు గేదెలూ వున్నాయి. వంట దగ్గిర నుంచి, ఇంటి చాకిరీ అంతా ఒక్కడే చేసుకుంటాడు. తన డబ్బును వడ్డీలకు అప్పు యిస్తూంటాడు. పళ్ళూ, పాలూ అమ్ముకుంటాడు. క్షణం విశ్రాంతి లేకుండా రోజంతా శ్రమపడి, రాత్రికి తన డబ్బేమయిపోతుందో అన్న బెంగతో సరిగా నిద్రపోడు.

ఒక్క పూట అయినా అతడు కడుపు నిండా భోజనం చేయగా చూడాలనిపించింది రాజుకు. ఆయన లోభికి ఒక బంగారు నాణెం యిచ్చి, "ఇద్దరు మనుషులకు ఘనంగా విందు ఏర్పాటు చేయించు," అన్నాడు.

"ఇద్దరెవరు?" అన్నాడు లోభి ఆశ్చర్యపోతూ.

"నువ్వూ, నేనూ. నేను రాజవంశీయుణ్ణి, ఒంటరిగా భోజనం చెయ్యను," అన్నాడు రాజు.



రాత్రికి విందు ఘనంగానే ఏర్పాటయింది. కాని, లోభి రాజుతో కలిసి భోజనం చెయ్యలేదు. అతడు కొంత డబ్బు తీసుకుని, ఊళ్ళో వున్న మరొక పరదేశిని విందు భోజనానికి వెంట తీసుకు వచ్చాడు.

భోజనం అయాక రాజు, లోభిని, "మనం కలిసి భోజనం చేద్దామనుకున్నాం. కాని, నువ్వు మరొకణ్ణి పిలుచుకు వచ్చావు. కారణం ఏమిటి?" అని అడిగాడు.

"కడుపునిండా తింటే, కంటినిండా కునుకు వస్తుంది. అప్పుడు యిక నా డబ్బు నాకు దక్కదు!" అన్నాడు లోభి.

రాజు ఆశ్చర్యపడి, "నీ వంటి లోభిని నేనెక్కడా చూడలేదు. నేనీ దేశాన్నేలే రాజును. నువ్వు, నా వెంట నగరానికి రా. నిన్ను మించిన లోభి లేడని ఋజువైతే, ఇప్పుడు నీకున్న ఆస్తికి రెట్టింపు డబ్బు యిస్తాను," అన్నాడు.

డబ్బుకు ఆశపడి లోభి, రాజు వెంట రావడానికి ఒప్పుకున్నాడు. రాజు గ్రామాధికారిని పిలిచి తానెవరయినదీ చెప్పి, లోభి ఇంటికి గట్టి కాపలా ఏర్పాటు చేశాడు. తరవాత లోభిని వెంట బెట్టుకుని రాజధాని చేరాడు.

రాజు, మంత్రికి లోభిని గురించి చెప్పి, తాను లోభుల మధ్య పోటీ ఏర్పాటు చేయాలనుకుంటున్నానన్నాడు.

"ప్రభూ, ఇది ప్రయోజనం లేని పని. వినోదానికైనా ఒక హద్దంటూ వుండాలికదా!" అన్నాడు మంత్రి.

"ఈ పోటీవల్ల ప్రయోజనమేమిటో, అది అయ్యాక తెలుస్తుంది," అన్నాడు రాజు.

మంత్రి ఒక వారం రోజుల్లో కొంతమంది లోభుల్ని పోగు చేశాడు. అందర్నీ ఒక చోట సమావేశపరిచారు.

పోటీ ఏమిటంటే, లోభుల్లో ఎవరైనా ముందుకు వచ్చి, మరొక లోభిని దానం అడగాలి. ఆ డబ్బు రాజు, లోభికి

యిస్తాడు. లోభి ఆ డబ్బు దానంగా యివ్వవచ్చు. లేదా పాతిక కొరడా దెబ్బలు తిని, తనే వుంచుకోవచ్చు. లోభిని అడిగి దానం పుచ్చుకోలేని దురదృష్టవంతుడికి ఒక కొరడా దెబ్బ శిక్ష పడుతుంది.

చాలామంది లోభులు కొరడా దెబ్బలు తిని, డబ్బు తమ వద్దనే వుంచుకోవాలనుకున్నారు. కాని, అయిదారు కొరడా దెబ్బలు తిన్నాక, బాధకు తట్టుకోలేక, రాజు యిచ్చిన డబ్బును దానం చేసేశారు. అఖరుకు రాజు గ్రామంనుంచి తనవెంట తీసుకువచ్చిన లోభివాడి వంతు వచ్చింది వాడిని దానం అడగడానికి, ఏ లోభీ ముందుకు రాలేదు.

రాజు వాళ్ళవంక ఆశ్చర్యంగా చూసి, "ఇంతవరకూ యీ పోటీలో ప్రతి ఒక్కడూ అంతో, యింతో లాభం పొందాడు. ఇంక ఒక్కడే మిగిలాడు. అతణ్ణి దానం అడగండి," అన్నాడు.

అప్పుడు లోభులంతా ఏకకంఠంగా, "ప్రభూ, ఇతడి ముఖం చూస్తూంటే, పాతిక కొరడా దెబ్బలు తినడమే కాదు, ప్రాణం పోయినాసరే తన డబ్బు ఎవరికీ యివ్వడని తెలిసిపోతున్నది. అడిగి లేదనిపించుకున్న పూకూ ఒక కొరడా దెబ్బ తప్పదుగదా!" అన్నారు.



రాజు తన వెంట తెచ్చినవాణ్ణి ఉత్తమ లోభిగా నిర్ణయించి, ఒక పెద్ద భవనం లోపలికి తీసుకుపోయాడు. అందులో రాజవంశానికి సంబంధించిన పురాతన వస్తువులెన్నో వున్నవి. పాలరాతి శిల్పాలు వజ్రవైడూర్యాలు పొదిగిన పిడులుగల కత్తులు, బంగారు దారాలతో నేసిన వస్త్రాలు, వెండి, బంగారు పాత్రలు.

ఇవన్నీ చూసి ఆశ్చర్యపోతున్న లోభితో రాజు, "ఈ మొత్తం భవనాన్ని నీకిచ్చేస్తాను. ఇక్కడ వుండిపోతావా ?" అన్నాడు.

లోభి తెల్లబోయి, అంతలోనే తేరుకుని, "ఇంతకన్నా అదృష్టమేమున్నది,

ప్రభూ! కాని, నా ఆస్తి అంతా గ్రామంలో వుండిపోయిందే,'' అన్నాడు.

''దాన్ని గురించి ఎలాంటి విచారం పెట్టుకోకు! నీ ఆస్తి అంతా బంగారంగా మార్చి, ఈ భవనంలోకి చేర్పిస్తాను,'' అన్నాడు రాజు.

లోభి అందుకు సంతోషంగా అంగీకరించాడు. రాజు అతడికి ఉచిత భోజన సదుపాయం కూడా ఏర్పాటు చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, వజ్రపురి రాజు చంద్రసేనుడి కన్న అవివేకులు మరెక్కడైనా వుంటారా? తరతరాలుగా అతడి పూర్వీకులు కూడబెట్టిన అంతులేని ధన సంపదను, ఒక లోభివాడి పరం చెయ్యడమేమిటి? ఇలాంటి రాజు పరిపాలనార్హుడెలా అవుతాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చంద్రసేనుడు నువ్వు అనుకుంటున్నట్టు అవివేకి కాదు. అతడు ఒక పథకం ప్రకారం లోభిని నగరానికి తీసుకువచ్చి, పరీక్ష పెట్టి, అందరికన్న ఉత్తమలోభి అని తెలుసుకున్నాడు. లోభి అయినవాడికి డబ్బు మాత్రమే సర్వస్వం, మరే సుఖాలూ ఆశించడు. డబ్బుకు రాత్రింబవళ్ళు కాపలా వుంటాడు తప్పితే, అందులోంచి చిల్లిగవ్వ ఖర్చుపెట్టడు. తరతరాలుగా రాజులు కూడబెట్టిన విలువైన వస్తువులను తస్కరించేందుకు ఎందరో ప్రయత్నిస్తూంటారు. వాటిని కాపాడుకోవాలంటే, నమ్మకస్థుడైన కాపలావాడు కావాలి. చంద్రసేనుడు అందుకు తాను వెంట తెచ్చిన లోభి తగినవాడని గుర్తించాడు. ఆ లోభి, తాను ఆ భవనానికి హక్కుదారునని అనుకోవచ్చు; కాని వాస్తవంలో దానికి కాపలావాడు మాత్రమే!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# స్వర్ణకారుడి ఎన్నిక

ఆనందపురం జమీందారు జగన్నాథం తన రెండవ కుమార్తె సుందరి పెళ్ళి వైభవంగా చేయదలిచాడు. ఆమెకు ఎన్నో విలువైన బంగారు ఆభరణాలు కావాలి. వాటిని తయారుచేసేందుకు నమ్మకమైన స్వర్ణకారుణ్ణి పిలిపించమని ఆయన, దివానుకు చెప్పాడు.

ఇదివరకు జమీందారు పెద్ద కుమార్తె మాలతి పెళ్ళికి చేయించిన ఆభరణాలలో స్వర్ణకారుడు చాలా కల్తీ కలిపి, నాణ్యత లేని ఆభరణాలు తెచ్చియిచ్చాడు. ఆ సంగతి తరవాత చాలా కాలానికి బయటపడింది. ఈసారి అలాంటి మోసం జరగకుండా జాగ్రత్తపడదలిచాడు జమీందారు.

సుందరి పెళ్ళి విషయం తెలియగానే ఆమెకు ఆభరణాలు మేము చేస్తామంటే, మేము చేస్తామని చాలామంది స్వర్ణకారులు దివాణానికి వచ్చారు. వాళ్ళల్లో చాలామంది పచ్చి మోసగాళ్లని దివానుకు తెలుసు. అందుచేత ఆయన వాళ్ళందరినీ పంపించివేశాడు.

ఆనందపురంలో ఆ యేడు కొత్తగా వృత్తి ప్రారంభించిన స్వర్ణకారులు ముగ్గురున్నారు. వాళ్ళు వీరాచారి, కైలాసం, బ్రహ్మం. ఈ ముగ్గురిలో ఎవరికో ఒకరికి, ఆభరణాలు చేసే పని అప్పగించాలనుకున్నాడు దివాను. వాళ్ళ పనితనాన్ని గురించి కొందరు దివాణం ఉద్యోగులు కూడా ఆయనకు చాలా గొప్పగా చెప్పారు.

దివాను ఆ ముగ్గురినీ పిలిపించి, వాళ్ళకు మాలతి ఆభరణాల్లో తలా ఒకటి యిచ్చి, వాటి నాణ్యత గురించి చెప్పమన్నాడు. ఆ మర్నాడే ముగ్గురు స్వర్ణకారులూ తిరిగివచ్చి దివానును కలుసు

రాంబాబు

కున్నారు. ఆ సమయంలో జమీందారు కూడా అక్కడే వున్నాడు.

వీరాచారి తాను తీసుకుపోయిన ఆభర ణాన్ని దివానుకు యిచ్చి, "అయ్యా, దీన్ని ఎవరు చేశారో కాని, యిందులో రెండు పాళ్ళు రాగి కలిపారు. స్వచ్ఛమైన బంగారం ఒక్క పాలు మాత్రమే వున్నది," అన్నాడు.

కైలాసం తాను తీసుకున్న ఆభరణాన్ని దివానుకు చూపుతూ, "అయ్యా, ఈ ఆభరణం చేసినవాడు పచ్చి మోసకారి. ఇందులో ఒక పాలు రాగీ, ఒక పాలు ఇత్తడీ కలిపాడు. ఇక మిగిలిన ఒక్క పాలుమాత్రమే మంచిబంగారం" అన్నాడు.

బ్రహ్మం కూడా తనకిచ్చిన ఆభర ణాన్ని దివానుకు అందజేస్తూ, "అయ్యా, ఇందులో ఒక్క పాలు మాత్రమే స్వచ్ఛ మైన బంగారం. మిగతా మూడుపాళ్ళూ బంగారం కాదు," అన్నాడు.

దివాను ముగ్గుర్నీ పంపివేసి, జమీం దారుతో, "తమరు ఏమాత్రం సంకోచించ కుండా ఆభరణాలు చేసే పనిని బ్రహ్మా నికి అప్పగించండి," అన్నాడు.

జమీందారు ఆశ్చర్యపోతూ, "వీళ్లల్లో బ్రహ్మం నిజాయితీపరుడని ఎలా తెలిసింది?" అని అడిగాడు.

"వీరాచారికీ, కైలాసానికీ బంగారంలో కల్తీ కలిపే అలవాటున్నది. అందువల్లనే వాళ్ళు, ముందుగా ఆభరణాల్లో కలిపిన యితర లోహాల మాట చెప్పి, తరవాతనే వున్న బంగారం సంగతి చెప్పారు. బ్రహ్మంలో అలాంటి మోసగుణం లేదు కాబట్టే, అతను ముందుగా ఆభరణంలో వున్న బంగారం పాలు చెప్పి, మిగతాది బంగారం కాదన్నాడు. ఆ ముగ్గురు యిచ్చిన జవాబులను బట్టి అతను నిజాయితీపరుడన్న నమ్మకం నాకు కలి గింది," అన్నాడు దివాను.

జమీందారు జగన్నాథం తన దివాను తెలివితేటలకు చాలా సంతోషించి, కుమార్తె ఆభరణాలు చేసే పని బ్రహ్మానికి అప్పగించాడు.





# అసూయాపరుడు

సిద్ధవరం గ్రామంలో సూరన్న, వీరన్న అనే యువకులుండేవారు. సూరన్నకు దాపులనున్న అడవి సమీపాన నాలుగెకరాల మెట్ట పొలం వుండేది. అతడు పొలం సేద్యం చేసుకుంటూ కాలం వెళ్ళబుచ్చేవాడు. వీరన్నకు ఆస్తిపాస్తులేం లేవు. అతడు అరణ్యంలో దొరికే ఫల సాయం పోగుచేసీ, కట్టెలు కొట్టితెచ్చీ గ్రామంలో అమ్ముకొని, రోజులు గడుపుకొస్తున్నాడు.

సూరన్నా, వీరన్నా కూడా సాముగరిడీల్లో, బలప్రదర్శనలో ఆ చుట్టుపక్కల గ్రామాల్లో బాగా పేరుమోసినవాళ్ళు. దసరాపండగలప్పుడు జరిగే యిలాంటి ప్రదర్శనలలో వీరన్న ప్రతి సంవత్సరం మొదటివాడుగానూ, సూరన్న రెండవ వాడుగానూ వస్తూండేవాళ్ళు. గెలిచిన వీరన్నకు విలువైన బహుమతులతోపాటు మంచి గౌరవమర్యాదలు కూడా జరుగుతూండేవి.

ఈ కారణంవల్ల సూరన్నకు, వీరన్న పట్ల చాలా అసూయగా వుండేది. అది క్రమంగా వీరన్నను ఎలాగైనా హతమార్చాలన్నంత పగగా తయారైంది.

ఒకసారి సాధువొకడు దక్షిణదేశం నుంచి కాశీకిపోతూ, సూరన్న పొలం పక్కన వున్న అరణ్యంలో, ఒక చెట్టు కింద నాలుగు రోజుల పాటు నివాసం ఏర్పరచుకున్నాడు. అలాంటివాళ్ళ దగ్గర ఏవో మహిమలుంటవని విని వున్న సూరన్న, అతడికి ఎంతో భక్తిగా పళ్ళూ ఫలాలూ సమర్పిస్తూ, సాధువు ఆదరణకు పాత్రుడయాడు.

సాధువు తిరిగి ప్రయాణం అయిపోతూ సూరన్నతో, "వయసులో చిన్నవాడివైనా, సాధుసన్యాసులంటే నీకున్న భక్తి, నాకు

గుంటక శాంబిరెడ్డి



చాలా సంతోషం కలిగించింది. ఏమన్నా సాయం కావాలంటే కోరుకో, యిస్తాను,'' అన్నాడు.

ఇలాంటి సమయంకోసమే ఎదురు చూస్తూ, వీరన్నను హతం చేసేందుకు మనసులో తిరుగులేదనుకున్న పథకం వేసుకున్న సూరన్న సాధువుతో, ''అయ్యా, అరణ్యం పక్కన వున్న నా పంటపొలానికి అడవి దున్నల నుంచీ, యితర మృగాల నుంచీ రక్షణలేకుండా పోతున్నది. వాటిని భయపెట్టేందుకు, నాకు కోరినప్పుడు ఏ క్రూర మృగం రూపమో వచ్చేటట్టు అనుగ్రహించండి,'' అన్నాడు.

సాధువు, సూరన్న ముఖంలోకి పరీక్షగా చూస్తూ చిన్నగా నవ్వి, తన సంచిలోంచి మూడు మూలికలు తీసి అతడికిస్తూ, ''ఇవి నీకు కోరినప్పుడు మూడుసార్లు మాత్రం ఏ జంతురూపం ధరించడానికైనా ఉపయోగపడతవి. ఈ మూలిక నోట్లో వేసుకుని నములుతూ, ఏ జంతు రూపం కావాలని కోరుకుంటావో, ఆ జంతురూపం వచ్చేస్తుంది. ఆ జంతు శరీరానికేదైనా ప్రమాదం జరిగినా, లేక తిరిగి యథా రూపం కావాలని కోరుకున్నా, ఆ రూపం నీకు వచ్చేస్తుంది,'' అని చెప్పాడు.

అనాటి నుంచీ సూరన్న, వీరన్నను తుదముట్టించేందుకు అవకాశం ఎప్పుడు దొరుకుతుందా అని ఎదురు చూడ సాగాడు. ఒకనాటి మధ్యాహ్నం వేళ వీరన్న అరణ్యంలోకి వెళ్ళడం సూరన్న కంటబడింది.

అతడు, వీరన్న వెనకగా బయలుదేరి అరణ్యంలోని గుబురు చెట్లచాటుకు పోయి, మూలికల్లో ఒకదాన్ని నమిలి, ఎలుగుబంటుగా మారాడు. వీరన్న తిరిగి వచ్చేటప్పుడు హఠాత్తుగా అతడి మీద పడి చంపాలని సూరన్న ఆలోచన.

సూర్యాస్తమయానికి మరికొద్ది కాలం వున్నదనగా వీరన్న చెట్లమధ్యగా వస్తూండడం, ఎలుగుబంటి రూపంలో వున్న

సూరన్న చూశాడు. వెంటనే అతడు పొదల చాటుగా నక్కుతూ వీరన్నను సమీపిం స్తుండగా, మరొక మనిషి హఠాత్తుగా చెట్ల వెనకనుంచి బయటికి వచ్చి, ఉచ్చు వేసివున్న తాడును గిరగిర తిప్పుతూ, "వీరన్నా, కొంచెం పక్కకు తప్పుకో! వచ్చిన పని వృధాకాలేదు; ఎలుగుబంటు దొరకనే దొరికింది," అన్నాడు.

వాడు పేరుమోసిన పెద్ద వేటగాడు. అరణ్యంలో దొరికిన క్రూరమృగాలను పట్టుకుని, నగరంలోని జంతుప్రదర్శన శాలకు అమ్ముతూ వుంటాడు. వాణ్ణి వీరన్నతో పాటు, సూరన్న కూడా ఎరుగు.



వేటగాణ్ణి చూస్తూనే సూరన్న బతుకు జీవుడా అనుకుంటూ దూరంగా చెట్లల్లోకి పారిపోయి, తనకు తిరిగి మామూలు రూపం రావాలని కోరుకున్నాడు. అంతలో అక్కడికి వేటగాడూ, వీరన్నా వచ్చి అతణ్ణి ఆ దాపుల ఎక్కడైనా ఎలుగుబంటును చూశావా అని అడిగారు. సూరన్న అమా యికంగా ముఖం పెట్టి, తానేం చూడ లేదని వాళ్ళకు చెప్పి, ఇంటి దారి పట్టాడు.

ఈ విధంగా సాధువు, సూరన్నకు యిచ్చిన మూలికల్లో ఒకటి వృధా అయి పోయింది. మర్నాడు సూరన్న బాగా ఆలోచించి అడవికిపోయి, మూలిక నమిలి ఎనుబోతు రూపం తెచ్చుకున్నాడు. ఆ రూపంలో వుండి వీరన్నను కొమ్ములతో పొడిచి, కాళ్ళతో తొక్కి చంపాలని అతడి ఆలోచన.

సూరన్న యిలా ఎనుబోతు రూపంలో వీరన్నను వెతుకుతూండగా, అతణ్ణి ఒక పెద్దపులి చూసి భయంకరంగా గాండ్రిం చింది. సూరన్న పరుగు పుచ్చుకున్నాడు. పులి వెంటబడి తరమసాగింది. ఇక లాభం లేదని అతడు తిరిగి మనిషి రూపం తెచ్చు కుని ఒక చెట్టుపైకి ఎగబాకి ప్రాణాలు రక్షించుకున్నాడు.

ప్రయత్నం ఫలించ కుండానే రెండవ మూలిక కూడా వృధాకావడంతో సూరన్న

యీసారి అరణ్యానికి పోయి పులి రూపం తెచ్చుకుని చెట్లచాటున పొంచి వున్నాడు. వీరన్న కొద్ది సేపటికి గొడ్డలి భుజాన పెట్టుకుని కట్టెలు కొట్టుకునేందుకు అటుగా వచ్చాడు.

సూరన్న చెట్టు చాటునుంచి భయంకరంగా గాండ్రిస్తూ బయటికి దూకాడు. హఠాత్తుగా పులిగాండ్రింపు విని వీరన్న బెదిరిపోయి పక్కకు తిరిగేంతలో గొడ్డలి భుజం మీదినుంచి జారి కింద పడింది. ఇక చావు తప్పదనుకుంటూ వీరన్న, దాపుల్లో వున్న పెద్ద ఊబిగుంట అంచునే పరిగెత్త సాగాడు. అతణ్ణి నోటపట్టాలన్న ఆదుర్దాలో సూరన్న కుప్పించి దూకుతూ పోతూ, కాలుజారి ఊబిగుంటలో పడిపోయాడు.

అందులో నుంచి బయిటకి రావాలన్న ప్రయత్నంలో సూరన్న అటూ ఇటూ కొట్టుకుని మరింతగా ఊబిలోకి దిగిపోసాగాడు. చావు భయంతో బెంబేలెత్తిపోయిన సూరన్న తిరిగి మనిషి రూపం తెచ్చుకుని, భుజాలలోతు ఊబిలోంచి చేతులు ఆడిస్తూ, "చచ్చిపోతున్నాను, వీరన్నా, రక్షించు!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు విని ఆశ్చర్యపోయి, వీరన్న అక్కడికి వచ్చి, తన పైపంచ సూరన్నకు అందించి, అతణ్ణి బయిటికి లాగుతూ, "సూరన్నా, నీకు పెద్దపులి రూపం ఎలా వచ్చింది? నా వెంట ఎందుకు పడ్డావు?" అని అడిగాడు.

సూరన్న, వీరన్న కాళ్ళ మీద పడి క్షమించమని కోరి, జరిగినదంతా దాచకుండా చెప్పాడు.

వీరన్న అతణ్ణి ఓదార్చుతూ, "సూరన్నా అసూయ మనిషిని క్రూరమృగంగా మార్చగలదని, నీ అనుభవం ద్వారానే రుజువయింది గదా! జరిగిందేమిటో యిద్దరం మరిచిపోదాం. ముందు ఆ కనబడే కొండవాగులో స్నానం చెయ్యి. తరవాత ఇంటికి వెళ్ళొచ్చు," అని, చేయి పట్టుకుని వాగుకేసి తీసుకుపోయాడు.





# చిత్రమైన జాతకం

కళింగ రాజ్యంలో అనేకమైన గొప్ప నగరాలుండేవి. అందులో దాంతిపురమనే నగరానికి ప్రభువు కళింగు. అతనికి పెద్ద కళింగు, చిన్న కళింగు అని ఇద్దరు కొడుకులు. వీరి జాతకాలు పరిశీలించిన దైవజ్ఞులు ఇలా చెప్పారు:

తండ్రి తదనంతరం పెద్దవాడే రాజ్యానికి వస్తాడు. చిన్నవాడిది మాత్రం చిత్రమైన జాతకం. అతని జీవితమంతా సన్యాసి యోగమే. కాని, మహారాజయోగం గల అదృష్ట వంతుడు కుమారుడుగా పుడతాడు!

కొద్ది కాలానికి రాజు కళింగు కాలం చేశాడు. జ్యేష్ఠుడు సింహాసన మధిష్ఠించాడు. చిన్నవాడికి రాజప్రతినిధి పదవి వచ్చింది. తనకు కలగబోయే కుమారుడు మహారాజు కాబోతాడని జ్యోతిష్కులు చెప్పిన మాట చిన్న కళింగుకు బాగా మనసుకి పట్టింది. ఈ ధీమాతో అతడు అన్నకు లొంగి వుండక స్వతంత్రుడుగా వ్యవహరింప సాగాడు. ఉభయుల మధ్య కలతలు ప్రారంభమైనై. రాజు చిన్నవాణ్ణి బంధించమని ఆజ్ఞాపించాడు.

అదే కాలమందు బోధిసత్వుడు అవతరించి, కళింగరాజ్య మంత్రులలో ఒకడుగా ఉంటూ వచ్చాడు. పెద్ద కళింగు తరంనాటికి అతడు బాగా వృద్ధుడయ్యాడు. కుటుంబ క్షేమం కోరిన ఆ వృద్ధ మంత్రి చిన్న కళింగు వద్దకు వచ్చి, రహస్యంగా రాజాజ్ఞను వెల్లడించాడు. రానున్న అవమానాన్ని తలపోశాడు చిన్నవాడు.

"తాతా! అన్నివిధాలా నాకు నీవే హితుడవు. అనాడు జ్యోతిష్కులు చెప్పిన మాటలు నీకు తెలుసుకదా! అవి ఫలించడమే నిజమైతే నా కోరిక నెరవేర్చవలసిన బాధ్యత నీపై వున్నది. ఇదిగో, నా పేరు



గల ఉంగరం, నా శాలువా, నా ఖడ్గం, ఈ మూడూ ఎవడైతే నీ వద్దకు తెచ్చి ఆనవాలు చూపిస్తాడో, వాడే నా కొడుకని గుర్తుంచుకో. నీ చేతనైన సహాయం కూడా చెయ్యి.'' అని చెప్పి రెండవ కంటికి తెలియకుండా అరణ్యాల్లోకి పారిపోయాడు.

ఆ రోజుల్లో మగధరాజుకు లేకలేక ఒక కుమార్తె కలిగింది. ఈమె జాతకం చూసిన జ్యోతిష్కులు, ''ఇది ఒక చిత్రమైన జాతకం. రాజకుమారి జీవితం ఒక సన్యాసినిగా గడుపుతుంది. ఐతే, ఆమెకు మహారాజ యోగం గల ఒక కుమారుడు పుడతాడు,'' అని చెప్పారు.

ఈ వర్తమానం తెలియగానే సామంత రాజులందరూ రాజపుత్రిని పెళ్ళాడాలని వచ్చి పోటీలు పడసాగారు. రాజుకు గట్టి చిక్కే వచ్చింది. వీరిలో తన కూతుర్ని ఏ ఒకరికి ఇచ్చినా తక్కినవారు కక్షగట్టి పగ తీర్చుకోవడం సహజం. కనుక, ఈ అపాయం నుండి తప్పించుకోడానికి నిశ్చయించాడు. గత్యంతరం లేక భార్యనూ, కూతుర్నీ వెంటబెట్టుకుని మారువేషంతో అరణ్యాల్లోకి పలాయనమయ్యాడు.

నదీతీరాన సదుపాయమైన జాగాలో ఒక చిన్న కుటీరం నిర్మించుకుని అందులో ముగ్గురూ కాలక్షేపం చేస్తూ వచ్చారు. వీరి కుటీరానికి కొంచెం ఎగువనే కళింగరాజపుత్రుని కుటీరం ఉన్నది.

ఒక రోజున, కుమార్తెను కుటీరంలో వదలి, మగధ రాజదంపతులు కంద మూల ఫలాదులకోసం వెళ్ళారు. ఆ సమయంలో రాజపుత్రి రకరకాల పువ్వులు పోగుచేసి ఒక చక్కని దండ కట్టింది.

కుటీరం పక్కనే గంగ ఒడ్డున ఒక గున్న మామిడిచెట్టు వుంది. మగధ రాజపుత్రి ఆ చెట్టెక్కి కొమ్మల్లో కూర్చుని తను కట్టిన పువ్వుల దండను అక్కడి నుండి నీటిలో పడవేసి, వేడుక చూస్తున్నది.

ఆ పువ్వులదండ తేలి ఆడుతూ పోయి పోయి, స్నానం చేస్తున్న చిన్న కళింగు తలకు తాకింది.

వెంటనే అతడు దానిని తీసి చూసి, "ఎంత చక్కటి పూలదండ! ఎన్ని రకాల పువ్వులు! దీనిని ఇంత ఇంపుగా సొంపుగా కూర్చినామె అపురూపమైన అందకత్తె అయివుంటుంది. ఈ మహారణ్యంలో ఇటువంటి సుందరికి పని యేమిటో?" అని ఎన్నోవిధాల ఆలోచించాడు. దండ కట్టిన సుందరిని వెతకాలని అతని మనస్సు ఉరకలు వేయసాగింది.

ఈ సంకల్పంతో కళింగు అరణ్య మార్గాన వెళుతూవుండగా, ఒక దిక్కు నుండి వీనులవిందు చేసే తీయని కంఠస్వరం వినవచ్చింది. అక్కడే నిలబడి అటు ఇటు చూడగా, మామిడిచెట్టు కొమ్మల్లో కూర్చొని పాడుతున్న సుందరి అతడికి కనిపించింది.

రాజపుత్రిని చూసి, కళింగు పరవశుడై, ఆమెతో కుశల ప్రశ్నలు ప్రారంభించాడు. చివరకు, ఆమెను తన భార్యగా చేసుకోవాలనే ఉద్దేశం వెల్లడించాడు. అందుకామె, "మీరు ఋషిసంతతికి చెందినవారు, మేము క్షత్రియులం!" అన్నది.

వెంటనే కళింగు, "నేనూ క్షత్రియుణ్ణే," అంటూ తన గుట్టుమట్టులన్నీ విప్పి చెప్పాడు. అప్పుడు రాజకుమారి తమ పరిస్థితులు కూడా దాపరికం లేకుండా చెప్పివేసింది.



ఇద్దరూ కలిసి ఆమె తండ్రివద్దకు వెళ్ళగానే, సంగతి సందర్భాలు తెలుసుకుని, "ఇతడే అమ్మాయికి తగిన వరుడు," అని మగధరాజు నిశ్చయించాడు.

చిన్న కళింగుకీ, మగధ రాజపుత్రికీ వివాహం జరిగింది.

కొద్ది కాలానికే వారికి ఒక కుమారుడు కలిగాడు. గొప్ప లక్షణాలతో ప్రకాశించే ఆ బిడ్డడికి, విజయకళింగు అని పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచుకుంటున్నారు.

కొన్నాళ్ళు గడిచిన తరవాత ఒక రోజున, కళింగు జాతకాలు తీసి, లెక్క వేసి గ్రహకూటాలు ఎలా వున్నదీ చూశాడు. అప్పటికి తన అన్న ఐన పెద్ద కళింగు ఆయువు మూడి వుంటుందని లెక్కలవల్ల తేలింది.

అప్పుడు కళింగు కొడుకును చేర బిలిచి, "కుమారా! నీవు జీవితం గడపవలసింది ఈ అడవులలో కాదు. నా అన్న పెద్ద కళింగు దాంతిపుర ప్రభువు. ఆ రాజ్యానికి వారసుడవు నీవే! కనుక, వెంటనే వెళ్లి ఆ సింహాసనం అధిష్ఠించు," అని చెప్పి, వృద్ధమంత్రిని గురించి చెప్పి, మూడు వస్తువులూ ఆనవాలిచ్చి దీవించి పంపాడు.

తలిదండ్రుల వద్దా, తాతా అమ్మమ్మల వద్దా సెలవు తీసుకున్న విజయకళింగు దాంతిపురం చేరుకుని, వృద్ధమంత్రిని దర్శించి, నేను ఫలానా అని చెప్పాడు.

అప్పటికి, చిన్న కళింగు అంచనా ప్రకారమే అతని అన్న కాలం చేశాడు; దాంతిపురం అరాచకస్థితిలో వున్నది.

ఒక మహాసభ ఏర్పాటు చేసి, వృద్ధ మంత్రి చిన్నవాడైన విజయకళింగు పుట్టు పూర్వోత్తరాలు వెల్లడించేసరికి, సభికులందరూ ఆశ్చర్యభరితులై జేజేలు కొట్టారు.

వృద్ధమంత్రి ఐన బోధిసత్వుడి సలహాలు పాటిస్తూ, విజయకళింగు చక్కగా రాజ్యం పరిపాలించి, పెద్దల పేరు నిలబెట్టాడు.






# తైమూర్ దాడి

సమర్కండ్ అమీరైన తైమూర్‌లేన్ భారతదేశం సంపద గురించి కథలు కథలుగా విన్నాడు. అక్కడి నుంచి వర్తకులు తీసుకువచ్చిన అద్భుతమైన వస్తువులను చూసి అమితాశ్చర్యం చెంది, భారతదేశం మీదికి దండెత్తాలని కలలుగనసాగాడు.

గొప్ప సైన్యాన్ని సమకూర్చుకుని తైమూర్ 1398 వ సంవత్సరంలో ఢిల్లీ మీదికి దండెత్తాడు. దారిలో తారసపడిన ప్రతి పల్లెనూ, పట్టణాన్నీ దోచుకుంటూ, వేనకు వేలమందిని బందీలుగా తన వెంట నడిపించాడు.





ఆ సమయంలో తుగ్లక్ వంశంలో ఆఖరివాడైన మహమూద్ ఢిల్లీని పరిపాలిస్తున్నాడు. అతడు తైమూర్ సేనలను ఎదుర్కొన్నాడు. కాని అతడి సైన్యం చాలా బలహీనం కావడంతో, ప్రవాహాన్ని ఆవలేని ఇసుక వంతెనలా అది ఉన్నచోటు కూడా తెలియకుండా పోయింది. తైమూర్ సులభంగా ఢిల్లీ నగరంలో ప్రవేశించాడు.



సుల్తాన్ మహమూద్ గుజరాత్‌కు పారిపోయాడు. తైమూర్ తన వెంట తీసుకొచ్చిన లక్షమంది ఖైదీలను, తిరుగుబాటు చేయగలరన్న అనుమానంతో, అందరినీ చంపించాడు. ఢిల్లీనగరం శివార్లు రక్తసిక్తమై ప్రజలను భయభ్రాంతులను చేసింది.

ఒకనాడు తైమూర్ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో కొందరు ఢిల్లీ నగర ప్రముఖులు అతడిని మంచి చేసుకోవాలని కొన్ని విలువైన బహుమతులు తీసుకుపోయి ఇచ్చారు.






కాని ఆ తర్వాత పరిస్థితి తారుమారయింది. తైమూర్ సైనికులు ఇద్దరు తప్పతాగి నగరవీధిలో గొడవ చెయ్యడంతో వారిలో ఒకణ్ణి ఒక వ్యాపారి లాగి చెంపదెబ్బ కొట్టాడు. ఆ సంఘటన తైమూర్ దృష్టికి వచ్చింది.



తైమూర్ ఈ సంఘటన సాకుగా తన సైనికులను అమాయకులైన నగర పౌరుల మీదికి ఉసికొల్పాడు. వాళ్ళు ఇల్లూ, కొట్టూ, గుడి అని భేదం లేకుండా దొరికినదంతా దోచుకున్నారు.

సైనికులు ఒక్కొక్క ప్రాంతాన్ని పూర్తిగా దోచుకున్న తరవాత, దానికి నిప్పంటించేవారు. ఇలా చాలామంది సజీవదహనం చేయబడ్డారు. మిగిలిన వారు నిరాశ్రయులయ్యారు. ఢిల్లీనగరం అంతకు ముందు కనీ వినీ ఎరుగని కిరాతక కృత్యాలను అనుభవించవలసి వచ్చింది.






వేలకొలదిమంది చంపబడ్డారు, చావగా మిగిలిన వారిని తైమూర్ సైనికులు జైళ్ళకు లాక్కుపోయారు. వాళ్ళను ఏమాత్రం ప్రతిఘటించినా, పారిపోవడానికి ప్రయత్నించినా ప్రజలు చావుకు గురికావలసి వచ్చింది. పదిహేను రోజులపాటు ఢిల్లీనగరం అమానుషమైన హింసలను అనుభవించింది.

ఢిల్లీనగరంలోని పందలాది మంది కళాకారులూ, శిల్పులూ తైమూర్ బందీలయ్యారు. అపారమైన ధన సంపదతో పాటు వందలాదిమంది శిల్పకారులను వెంటబెట్టుకుని తిరుగుముఖం పట్టాడు తైమూర్. తిరుగు ప్రయాణంలోనూ దారి పొడవునా, మీరట్, కాంగ్రా, జమ్మూ మొదలైన ప్రాంతాలను దోచుకుంటూ నాశనంచేస్తూ వెళ్ళాడు.





తైమూర్ వెళ్ళిన తర్వాత ఢిల్లీనగరం ఘోరమైన కరువు కాటకాలకూ, వ్యాధులకూ గురయింది. అందువల్ల ప్రాణాలతో మిగిలిన కొద్దిమంది కూడా, కొన్నాళ్ళకు చనిపోయారు. అందమైన ఢిల్లీ నగరం దయ్యాల నగరంలా కనిపించింది.

తైమూర్ తన వెంట తీసుకొచ్చిన భారతీయ శిల్పులచేత సమర్కండ్‌లో ఒక బ్రహ్మాండమైన మసీదును నిర్మించాడు. అది ఆ ప్రాంతంలోని శిల్పకళను ఎంతో ప్రభావితం చేసింది. భారతదేశం మీదికి దాడి జరిపిన ఏడేళ్ళ తర్వాత **1405** వ సంవత్సరంలో తైమూర్ మరణించాడు.





# గౌరవం

గొప్ప సంగీత విద్వాంసుడని పేరుపొందిన చండప్రచండుడు ధర్మవరం వచ్చాడు. ఆయన ఎన్నో దేశాలు తిరిగి, లెక్క లేనన్ని రాజసన్మానాలు పొంది, అంతు లేని ఐశ్వర్యవంతుడై, ఆ ఊరు చేరాడు. అంత గొప్పవాడు తమ ఊళ్ళో వుంటున్నందుకు, ఊరివారంతా సంతోషించారు.

ధర్మవరం జమీందారుకు ఎంతో మర్యాదస్థుడని పేరు. చండప్రచండుడు తన గ్రామం వచ్చినప్పుడు ఆయన విద్వాంసుణ్ణి ఘనంగా సత్కరించి, ఇల్లు దొరికేవరకూ తన ఇంటనే ఆతిథ్యం యిచ్చాడు.

జమీందారుకు నలుగురు పిల్లలున్నారు. వాళ్ళందరికి సంగీతమంటే మంచి ఆసక్తి. వాళ్ళుకాక ఆయన బంధువుల పిల్లలు మరొక ఆరుగురున్నారు. వాళ్ళకూ సంగీతమంటే ఆసక్తి వున్న కారణంగా జమీందారు పొరుగూరు విద్వాంసుడొకణ్ణి వాళ్ళకు గురువుగా నియమించాడు.

ఈ గురుశిష్యులు చేసే సంగీత సాధన చండప్రచండుడు ఒకసారి విని, జమీందారుతో, "ఈ మహాప్రపంచంలో యింతకంటే విద్వాంసుడే మీకు దొరక లేదా? ఆయన మీ పిల్లలను తప్పు దారిలో పెడుతున్నాడు," అన్నాడు.

చండప్రచండుడు చెప్పింది విని, జమీందారు నవ్వి వూరుకున్నాడు. కాని, ఆయన గురువును మాన్పించలేదు. కొద్ది రోజుల తర్వాత చండప్రచండుడు ఒక మంచి ఇల్లు కొనుక్కుని అందులో కాపరం పెట్టాడు. కొద్దికాలం గడిచాక ఏ కారణంవల్లనో పొరుగూరి విద్వాంసుడు రావడం మానుకున్నాడు.

ధర్మవరంలో సంగీతం నేర్చుకునే పిల్లలేకానీ, సంగీతం వినే పెద్దలు లేరు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



ఒంటరిగా సంగీత సాధన చేసుకోవడం చండప్రచండుడికి బాగా విసుగనిపిస్తున్నది. జమీందారు అడిగితే, ఆయన ఇంట్లోని పిల్లలందరికీ తను సంగీతం చెప్పాలని ఆయన అనుకున్నాడు. కాని, మాటవరసకైనా జమీందారు, చండప్రచండుడి దగ్గిర ఆ ప్రసక్తి తేలేదు.

కొన్ని రోజులు చూసి చండప్రచండుడు జమీందారుతో, "మన ఊరిలో సంగీతం నేర్చుకోవాలన్న కోరిక వున్నవాళ్ళందరికీ ఉచితంగా సంగీతం చెప్పదలిచాను," అన్నాడు.

ఆయన అలా అన్న మర్నాడే వందమంది శిష్యులు తయారయ్యారు. నాలుగు రోజులపాటు చండప్రచండుడు వాళ్ళతో నానా శ్రమా పడ్డాడు. ఒక్క జమీందారింటి పిల్లలకు తప్ప, మిగతా వాళ్ళందరికీ ముందు రోజు చెప్పిన పాఠాలు మర్నాటికి గుర్తుండేవి కావు. ఒకనాడు వచ్చినవాడు, రెండోనాడు వచ్చేవాడు కాదు. ఈ శిష్యుల బెడద ఎలా వదుల్చుకోవాలో తెలియక చండప్రచండుడు, జమీందారునే సలహా అడిగాడు. "ఊరికే సంగీతమంటే అడ్డమైనవాళ్ళూ వస్తారు; ఎంతో కొంత జీతం అనండి, సరిపోతుంది," అన్నాడు జమీందారు.

ఆ విధంగానే చండప్రచండుడు నెలకు వరహా జీతం యివ్వగలవాడినే శిష్యుడుగా తీసుకుంటానన్నాడు. దానితో ఆయన శిష్యుల సంఖ్య వందనుంచి ఇరవైకి పడిపోయింది. అందులో పదిమంది జమీందారు పిల్లలు; మిగతావాళ్ళు సామాన్య కుటుంబీకులు.

చండప్రచండుడు ఎంతో శ్రద్ధగా తన శిష్యులను తీర్చిదిద్దేవాడు. సంగీతంలో వాళ్ళను తనంతటివాళ్ళను చేయాలని ఆయన కోరిక. కాని, జమీందారు ప్రవర్తన ఆయనకు బాధ కలిగించసాగింది. సామాన్య శిష్యుల తలిదండ్రులు తరచుగా చండప్రచండుడి దగ్గిరకు వెళ్ళి,

ఆయనను మెచ్చుకుంటూండేవాళ్ళు. నెల జీతం ప్రతి మాసంలోనూ పున్నమి వెళ్ళిన ఏకాదశినాడు అందజేస్తూండేవాళ్ళు. జమీందారు మాత్రం ఆయనను ఏనాడూ పొగడలేదు. నెల జీతం కూడా ఏనాడూ సక్రమంగా యివ్వలేదు. ఒక్కొక్కసారి చండప్రచండుడే జీతం విషయం శిష్యులకు గుర్తుచేస్తూండేవాడు.

ఒక సంవత్సరంపాటు యిలాగే జరిగింది. తను జీతం తీసుకుని సంగీతం చెబుతున్న కారణంగా జమీందారు తనను గౌరవించడం లేదని చండప్రచండుడికి అనుమానం వచ్చింది.

ఆయన ఒకనాడు జమీందారును కలుసుకుని, "నా ఆరోగ్యం బావుండడం లేదు. మీ పిల్లల సంగీత శిక్షణకు మరొక గురువును చూసుకోండి," అన్నాడు.

"తమ ఆరోగ్యంకన్న ముఖ్యమైంది మరేంలేదు! మీరు విశ్రాంతి తీసుకోవడం మంచిది," అన్నాడు జమీందారు.

దీనితో చండప్రచండుడికి జమీందారు మీద చాలా కోపం కూడా వచ్చింది. ఆయన తనను బతిమాలి, తన పిల్లలకు పాఠాలు చెప్పడం మానవద్దని కోరతాడనుకున్నాడు. కాని, అలా జరగలేదు.

ఒక్క వారం గడిచే లోపల ఊళ్లోకి కొత్త సంగీత గురువు వచ్చాడు.



జమీందారు ఆయనకు నెల నెలా రోజు తప్పకుండా జీతం యిచ్చేవాడు. ప్రతి రోజూ ఒకసారి పలకరించి పాఠం బాగా చెబుతున్నారని ప్రోత్సహించేవాడు.

ఈ కొత్త గురువు పేరు సంగీతశర్మ. తనకు వచ్చినంతలో సంగీతం ఇతరులకు నేర్పడమేగాక, గొప్ప విద్వాంసులు దొరికితే వారి వద్ద నేర్చుకోవాలని అనుకుంటూండేవాడు. అతడికి చండప్రచండుడిని గురించి తెలిసి, ఆయన దర్శనానికి వెళ్లాడు. చండప్రచండుడు సంగీతశర్మను సాదరంగా ఆహ్వానించి, జమీందారు అతడినెలా ఆదరిస్తున్నాడో తెలుసుకుని ఆశ్చర్యపోయాడు.

ఆయన సంగీతశర్మతో, "నాకు తెలిసిన విద్య అంతా నీకు నేర్పుతాను. కాని, జమీందారు నిన్ను గౌరవించినట్టుగా, నన్ను గౌరవించలేదు. నేనడిగినట్టుగా కాక - జమీందారు నా పట్ల అలా ప్రవర్తించడంలోని రహస్యమేమిటో తెలుసుకుని, నాకు చెప్పాలి. ఎందుకంటే, నాలో లోపమేమైనావుంటే సవరించుకోవాలని వున్నది," అన్నాడు.

ఈ విషయం సంగీతశర్మకూ ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడు జమీందారును కలుసుకుని, "అయ్యా, తమరు నా పట్ల ఎంతో దయ చూపిస్తున్నారు. కానీ, గతంలో మీ పిల్లలకు సంగీత బోధన చేసిన చండప్రచండులవారికి నెల జీతం సరిగా యిచ్చేవారు కాదనీ, ఎదటపడి వారిని మెచ్చుకునేవారు కాదనీ, కొందరు చెప్పగా విన్నాను. మీరు మరోలా భావించకపోతే, వారికంటే ఎక్కువ గౌరవానికి నేనెలా అర్హుణ్ణయానో తమనుంచి వినాలని వున్నది," అన్నాడు.

జమీందారు నవ్వి, "చెపితే నువ్వు బాధపడవు గదా?" అన్నాడు.

"ఇందులో బాధపడవలసిందేముంటుంది, చెప్పండి!" అన్నాడు సంగీతశర్మ.

"నువ్వు డబ్బు కోసం సంగీతం చెబుతున్నావు; ఆయన సరదా కోసం చెప్పేవాడు. ఆయనకు నెలజీతం యివ్వాలంటే, పాఠానికి యింత అని వెల కట్టినట్టు అనిపించి యిబ్బందిగా వుండేది. ఎదటపడి పొగడడానికి కూడా అంతే! మహారాజ సన్మానాలందుకున్న ఆయనకు నా పొగడ్తలేపాటి? వచ్చిన కాస్త విద్యతో పొట్ట చేతపట్టుకు వచ్చిన నిన్నూ, ఆ మహా విద్వాంసుణ్ణీ ఒకేలా ఎలా చూసేది?" అన్నాడు జమీందారు.

ఈ విషయం సంగీతశర్మ ద్వారా విని చండప్రచండుడు, జమీందారును అపార్థం చేసుకున్నందుకు ఎంతగానో నొచ్చుకున్నాడు. ఆ తర్వాత ఒకరోజున జమీందారు చండప్రచండుడికి బంగారు గండపెండరం తొడిగి ఘనంగా సన్మానించాడు.





# వ్యర్థమైన తీర్పు

నాగపట్టణానికి రాజైన శక్తిసింహుడి ఆస్థానంలో ఆయనకు అభిమాన పాత్రులు ఇద్దరు ఉండేవారు. వారిలో ఒకడు సూర్యవర్మ అనే సామంతుడు. ఈయన రాజుగారికి దగ్గిర బంధువు కూడానూ. ఆయనకు సీమంతిని అని ఒక పెళ్ళియీడు వచ్చిన కుమార్తె కూడా ఉండేది.

రాజుగారికి ప్రాణం కన్న ఎక్కువైన రెండవ వ్యక్తి చంద్రపాలు డనే యువకుడు. అతను రాజుగారికి ప్రధాన అంగరక్షకుడు. రాజుగారు యుద్ధానికి బయలుదేరి వెళ్ళినప్పుడు కూడా చంద్రపాలుడు రాజుగారి వెంట ఉండి అసామాన్య పరాక్రమ విక్రమాలతో శత్రువులపై యుద్ధం చేసేవాడు.

అతను యుద్ధ రంగంలో రాజుగారి ప్రాణాలను ఎన్నిసార్లు కాపాడాడో లెక్కలేదు. అందుచేత రాజుగారు అతణ్ణి తన కొడుకు కన్న ఎక్కువగా చూసుకునేవాడు. రాజభటులలో ప్రతి ఒక్కడూ అతనిని దైవంలాగా పూజించేవారు. సూర్యవర్మ కుమార్తె సీమంతిని ఏనాడో చంద్రపాలుణ్ణి తన భర్తగా ఎన్నుకున్నది. తగిన అవకాశం చూసి అతనిని పిలిపించింది. ఇద్దరూ మాట్లాడుకున్నారు. ఒకరినొకరు ప్రేమించుకున్న వారు కావటంచేత పెళ్లాడ నిశ్చయించుకున్నారు.

చంద్రపాలుడు ఈ విషయాన్ని రాజుగారికి చెప్పాడు. రాజుగారు సూర్యవర్మను పిలిచి, ''నీ కుమార్తె సీమంతిని చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నట్టు విన్నాను. వారిద్దరికీ వివాహం జరుపుదామా?'' అని అడిగాడు.

ఈ మాట వినగానే సూర్యవర్మ ముఖం జేవురించింది. ''అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు! నే నీ పెళ్ళికి ఒప్పను!



అసలు నా కూతురు చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నదంటే కూడా నేను నమ్మను!'' అన్నాడాయన రాజుగారితో.

తరవాత సూర్యవర్మ ఇంటికి వెళ్ళి కుమార్తెతో మాట్లాడాడు. తాను చంద్రపాలుణ్ణి ప్రేమిస్తున్నట్టు సీమంతిని ఒప్పుకున్నది. సూర్యవర్మ మండిపడి ఆమెను నానా చివాట్లూ పెట్టాడు.

ఇది జరిగిన మర్నాడే సీమంతిని ఎవరికీ తెలియకుండా ఇంటి నుంచి బయలుదేరి వెళ్ళి చంద్రపాలుణ్ణి కలుసుకున్నది. వారిద్దరికీ ఒక పురోహితుడు పెళ్ళి చేశాడు. వారిద్దరూ అడవిలోకి వెళ్ళి అక్కడ కాపరం పెట్టారు.

ఈ అడవి చంద్రపాలుడిదే. కొంత కాలం కిందట రాజుగారు చంద్రపాలుడికి నగరం వెలపల కొంత భూమి మాన్యంగా ఇచ్చాడు. అందులో ఒక భాగంలో అశోక చెట్లు మాత్రమే ఉన్న అడవి ఉన్నది. అక్కడ చంద్రపాలుడు కుటీరం నిర్మించాడు.

సూర్యవర్మ రాజుగారితో ఏకాంతంగా మాట్లాడి, ''నేను నలుగురిలోనూ తల ఎత్తుకు తిరగలేని పరిస్థితి ఏర్పడింది. నా కుమార్తెను నాకు అప్పగించమని మీరు కబురు చేస్తే చంద్రపాలుడు మీ మాట తోసి వెయ్యడు!'' అన్నాడు.

రాజుగారు, ''కబురు చేస్తాను!'' అన్నాడు. కాని ఆయన ఏమీ చెయ్యలేదు, చూసీచూడనట్టుగా ఊరుకున్నాడు.

సూర్యవర్మ రాజుగారి చేత ఏదో ఒకటి చేయించాలనే ఉద్దేశంతో ఒక యుక్తి పన్నాడు. ఆయన నిండుసభలో లేచి నిలబడి, ''మహారాజా, చంద్రపాలుడు నా కుమార్తెను బలాత్కారంగా తీసుకుపోయి అరణ్యంలో ఉంచాడని తెలిసింది. ఆమెను తిరిగి నాకు ఇప్పించి, ఆ దుర్మార్గుణ్ణి శిక్షించి నాకు న్యాయం చేయమని తమరిని అర్థిస్తున్నాను!'' అన్నాడు.

ఇప్పుడు రాజుగారు విధిగా చర్య తీసుకోవలసి వచ్చింది. ఆయన తన భటు

లకు. "మీరు అరణ్యానికి వెళ్ళి చంద్రపాలుణ్ణి బంధించి తీసుకు రండి. సీమంతినిని తెచ్చి క్షేమంగా సూర్యవర్మ ఇంట చేర్చండి!" అని ఉత్తరువిచ్చాడు.

వెంటనే భటులు అశోకవనానికి బయలుదేరారు. సూర్యవర్మ కూడా కత్తి తీసుకుని వీరుడులాగా వారి వెంట వెళ్ళాడు.

నిజానికి రాజభటులందరికీ చంద్రపాలుడంటే అమితమైన అభిమానం. అతనితో యుద్ధం చెయ్యాలన్న కోరిక వారిలో ఏ ఒక్కడికీ లేదు. అందుచేత వారు తమలో ఇద్దరిని ముందుగా చంద్రపాలుడి వద్దకు పంపి జరిగిన సంగతి కబురు చేశారు.

సూర్యవర్మ తనను పట్టుకోవటానికి రాజభటులను తెస్తున్నాడని తెలియగానే చంద్రపాలుడు సీమంతినిని తీసుకుపోయి అరణ్యంలో దూరంగా సురక్షితమైన ఒక రహస్యస్థలంలో దాచి తిరిగి తన కుటీరానికి వచ్చేశాడు. మరి కొంతసేపటికి సూర్యవర్మ రాజభటులతో సహా వచ్చి, భటులను కుటీరం చుట్టూ నిలబెట్టి తలుపు తట్టాడు.

చంద్రపాలుడు బయటికి వచ్చాడు. అతను సూర్యవర్మను ఎగాదిగా చూసి, "మీకు శౌర్యం తక్కువయిందా ఏమిటి, ఇంతమందిని తోడు తెచ్చారు? ఇవాళ మీరో, నేనో తేల్చుకుందాం!" అంటూ కత్తి దూశాడు.





"నీతో యుద్ధంచేసే ఖర్మ మేమిటి నాకు? ఒరే, ఈ నీచుణ్ణి పట్టి బంధించండి!" అన్నాడు సూర్యవర్మ రాజభటులతో. వారిలో ఒక్కడూ కదలలేదు. చంద్రపాలుడు ద్వంద్వయుద్ధానికి ఆహ్వానిస్తే నిరాకరించినందుకు సూర్యవర్మను చూసి వాళ్ళు అసహ్యించుకున్నారు.

"సరే, అయితే పట్టుకోండి!" అంటూ చంద్రపాలుడు రాజభటుల మధ్యగా అరణ్యంలోకి పరిగెత్తాడు. రాజభటులు అతన్ని పట్టుకోలేదు. కుటీరంలో సీమంతిని జాడ దొరకలేదు. సూర్యవర్మ చేసిన యింత పెద్ద ప్రయత్నమూ బూడిదలో పోసిన పన్నీరయింది.

ఇక రాజుగారిని నమ్ముకుంటే పని కాదని సూర్యవర్మ ఈసారి ఇంకొక ఎత్తు ఎత్తాడు. ఆయన కొందరు కవులనూ, గాయకులనూ పిలిపించి, వారికి డబ్బు బాగా యిచ్చి, "మీరు అశోకవనానికి వెళ్ళి అక్కడ ఉండే చంద్రపాలుణ్ణి కీర్తించుతూ పద్యాలు చదవండి, పాటలు పాడండి. ఈ లోపుగా నా నౌకర్లు అతన్ని పట్టి బంధించి నా దగ్గరకు తెస్తారు. తరవాత మీ దారిన మీరు వెళ్ళిపోవచ్చు!" అన్నాడు.

ఈ యుక్తి పారింది. కవి గాయకులు చంద్రపాలుడి కుటీరానికి వెళ్ళి స్తోత్రపాఠాలు చదివే సమయంలో, సూర్యవర్మ నౌకర్లు అకస్మాత్తుగా చంద్రపాలుడిపై బడి బంధించి తెచ్చి, సూర్యవర్మ ఎదట ఉంచారు. ఆయన అతన్ని పట్టించుకుని రాజసభకు వెళ్ళి, "మహారాజా, దోషిని పట్టి తెచ్చాను, విచారించండి!" అన్నాడు.

రాజుగారు చంద్రపాలుడితో, "నీవు సీమంతినిని బలాత్కారంగా తీసుకుపోయావట. దానికేం చెబుతావు?" అని అడిగాడు.

"అదే, నా నేరమైతే నేను నిర్దోషిని, మహారాజా! సీమంతిని బుద్ధిపూర్వకంగా నా వద్దకు వచ్చి నన్ను వివాహమాడింది!" అన్నాడు చంద్రపాలుడు.

సూర్యవర్మ ఆగ్రహావేశంతో, "నేను ఇతనికి కన్యాదానం చెయ్యలేదు. అందు చేత తండ్రినైనందుకు నాకు సీమంతినిపై గల హక్కు ఇంకా నాదిగానే ఉన్నది. ఈ పెళ్ళి చెల్లదు!" అన్నాడు.

రాజుగారు ఉభయులనూ ఏదోవిధంగా సమాధాన పరచాలని ప్రయత్నించాడు. సీమంతినిపై గల హక్కును విడిచి పుచ్చటానికి ఇటు సూర్యవర్మా సమ్మతించ లేదు, అటు చంద్రపాలుడూ సమ్మతించలేదు.

చివరకు ప్రాణం విసిగి, "అయితే నా తీర్పు వినండి. సీమంతిని ఉభయుల వద్దా ఉంటుంది. చెట్ల ఆకులు రాలేదాకా భర్త వద్ద ఉండి, చెట్లు మోడయినాక తండ్రి ఇంటికి వచ్చేస్తుంది. తిరిగి చెట్లు చిగిర్చినాక తన భర్త వద్దకు వెళ్ళుతుంది!" అన్నాడు.

ఈ తీర్పు సూర్యవర్మకూ నచ్చలేదు, చంద్రపాలుడికీ నచ్చలేదు; కాని దానికి ఇద్దరూ బద్ధులుగాక తప్పింది కాదు.

కొంతకాలం గడిచింది. ఆకులు రాలే కాలం వచ్చింది. చెట్లన్నీ మోడు కాసాగాయి. సూర్యవర్మ తన కుమార్తె వద్దకు తన మనుషులను పంపి, రాజు గారి తీర్పు గురించి ఆమెకు చెప్పి ఆమెను వెంటపెట్టుకు రమ్మన్నాడు. ఒకసారి ఆమె తన ఇంటికి వస్తే తిరిగి భర్త వద్దకు వెళ్ళకుండా చెయ్యాలనే ఆయన దురుద్దేశం.

సీమంతిని తన తండ్రి దూతలు చెప్పినదంతా విన్నది. ఆమె వారితో, "ఆకులు రాలి చెట్లు మోడయాక గద నేను మా తండ్రి ఇంటికి వెళ్ళేది? ఇంకా ఆకులు రాలటం లేదు. ఈ చెట్లు మోడయాక అలాగే వస్తాను!" అంటూ వారికి చుట్టూ వున్న అశోకవృక్షాలను చూపింది. సూర్యవర్మ మనుషులు తిరిగి వెళ్ళిపోయారు.

అశోకవృక్షాలు ఆకులు రాల్చవు, ఎన్నడూ మోడు కావు. అందుచేత సీమంతిని తన తండ్రి ఇంటికి మళ్ళీ వెళ్ళనే లేదు.





# బతుకుభయం

వీరప్ప అనే బిచ్చగాడొకడు, బతుకు మీద విసుగుపుట్టి ఆత్మహత్య చేసుకుందామని అరణ్యంలో వున్న ఒక పెద్ద కొండ కేసి నడవసాగాడు. దారిలో అతడికి అనంతుడనే వాడొకడు తారసపడ్డాడు. వాడూ బతుకు మీద రోత పుట్టినవాడే.

ఇద్దరూ కొండ చేరి, దాని ఎత్తయిన శిఖరం మీదినుంచి కిందికి దూకుదామని పోతున్నంతలో, ఒక గుహలోంచి భయంకరుడైన రాక్షసుడు హఠాత్తుగా బయటికి వచ్చి, వాళ్ళను పట్టుకున్నాడు.

వీరప్పా, అనంతుడూ ఏమాత్రం భయపడక, "మేము చచ్చిపోయేందుకు కొండశిఖరం కేసి పోతున్నాం. మాకు ఆ శ్రమ తప్పించావు!" అన్నారు.

ఆ మాటలకు రాక్షసుడు ఆశ్చర్యపడి, వాళ్ళను ఆత్మహత్య చేసుకోవలసినంత కష్టాలేం కలిగినవని అడిగాడు.

దానికి వీరప్ప, "నేనొక బిచ్చగాణ్ణి. నా తండ్రీ, తాతలు కూడా బిచ్చగాళ్ళే. కాని, నేను బిచ్చానికి పోతే, ప్రతివాళ్ళూ నన్ను అసహ్యించుకుని, పో దున్నపోతులా వున్నావంటున్నారు. నాకు బతుకంటే భయం పట్టుకున్నది," అన్నాడు.

రాక్షసుడు, వీరప్పను అడిగినట్టే అనంతుణ్ణి అడిగాడు. వాడు విచారంగా ముఖం పెట్టి, "నా కష్టాలేమని చెప్పుకునేది! నేను కొద్దిపాటి ఆస్తిపాస్తులున్నవాణ్ణే. కాని, నా భార్యకు మితిమించిన నగలపిచ్చి. ఎప్పుడూ కొత్త నగలు చేయించమని పోరు పెడుతుంది. అది నా శక్తికి మించిన పని అని చెప్పినా వినదు. ఈ ఇంటి పోరు భరించలేక జీవితమంటే విసుగు పుట్టింది," అన్నాడు.

రాక్షసుడు గుహలోకి పోయి రెండు సంచుల నిండుగా బంగారు నాణాలు

వల్లూరు బాబురావు

తెచ్చి, ముందుగా ఒక సంచిని వీరప్ప కిస్తూ, "గృహస్థులు నీకు బిచ్చం వెయ్యకుండా దున్నపోతంటూ తిట్టి పంపడంలో తప్పేంలేదు. నువ్వు శరీరశ్రమ చేయగలవుగాని, అదంటే నీకు అయిష్టం, బద్ధకం. వాటిని వదిలించుకునేవరకూ, యీ ధనంతో ఏదైనా వ్యాపారం చెయ్యి. సంవత్సరం గడిచాక, యిదే రోజున యిక్కడికి వచ్చి కనబడు," అన్నాడు.

తరవాత రెండో సంచిని అనంతుడికిస్తూ, "ఈ ధనంతో నీ భార్యకు నగలు చేయించి, అంతటితో తృప్తిపడమని చెప్పు. చావంటే భయంలేని యింత ధైర్యవంతుడివి, భార్యపట్ల అంత పిరికివాడిలా ప్రవర్తించడం సిగ్గుచేటు," అన్నాడు.

వీరప్పకు చెప్పినట్టే, అనంతుణ్ణీ ఒక సంవత్సరం తరవాత వచ్చి కలుసుకోమన్నాడు రాక్షసుడు. ఆ ఇద్దరూ సంతోషంగా తమ, తమ గ్రామాలకు వెళ్ళారు.

సంవత్సరం గడవగానే వీరప్ప గుహ దగ్గిరకు వచ్చి రాక్షసుణ్ణి కలుసుకున్నాడు.

వీరప్ప తన వెంట తెచ్చిన డబ్బు సంచిని రాక్షసుడి పాదాల ముందుంచి, వాడికి నమస్కరించి, "నువ్వు, నా కళ్లు తెరిపించావు. చేతనైన పని ఏదో ఒకటి చేస్తూ బతకడంలో వున్న సుఖం గ్రహించాను. బిచ్చమెత్తడం మానివేశాను. నా రెక్కల కష్టం మీద హాయిగా కాలం గడిచిపోతున్నది. నువ్వు యిచ్చిన డబ్బులో ఒక్క పైసా కూడా ఖర్చు



చేయలేదు. నీ డబ్బు, నువ్వే వుంచుకో," అన్నాడు.

రాక్షసుడు వీరప్పను మెచ్చుకుని, డబ్బు సంచీని గుహలోకి గిరవాటువేశాడు.

అంతలో అక్కడికి అనంతుడు వచ్చాడు. అతడి వెంట ఒక స్త్రీ వున్నది. ఆమె మెడలో ఒక్క మంగళసూత్రం తప్ప, ఒంటిమీద మరెలాంటి నగాలేదు. ఆమె చేతిలో ఒక చిన్న మూట వున్నది.

రాక్షసుడూ, వీరప్పా ఆమె కేసి ఆశ్చర్యంగా చూస్తున్నంతలో అనంతుడు, "అయ్యా, యీమె నా భార్య!" అని లోగడ రాక్షసుడు యిచ్చిన డబ్బు సంచీని వాడి కాళ్ళముందు పెట్టాడు.

రాక్షసుడు కనుబొమలు చిట్లించి, "అంత నగల పిచ్చిగలదని చెప్పిన నీ భార్య ఒంటి మీద నగంటూనే లేదు. నగల పిచ్చి వదలకొట్టేందుకు, ఆమెను ఏమైనా హింసలపాలుచేశావా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు అనంతుడు జవాబివ్వబోయేంతలో అతడి భార్య, "మీది రాక్షస రూపమయినా స్వభావం దేవతలకే చెల్లు! నా భర్త యీ కొండ ప్రాంతానికి వచ్చిన కారణంతోపాటు ఆయనకు మీరిచ్చిన సలహా కూడా విన్నాను. భర్తకు సంసారంపట్ల విరక్తి కలిగించే నా నగల పిచ్చికి స్వస్తి చెప్పాను. అందుకు సాక్ష్యంగా, యీ నగల మూటను తమ ముందు వుంచుతున్నాను," అంటూ మూటను రాక్షసుడి ముందు పెట్టింది.

రాక్షసుడు సంతోషం పట్టలేక పెద్దగా నవ్వి, గుహలోకి పోయి, వీరప్ప ధనం సంచీని తెచ్చి అతడికిచ్చి; అనంతుణ్ణీ, అతడి భార్యనూ ధనం సంచీనీ, నగల మూటనూ తీసుకోమని చెప్పి, "మీ ముగ్గురి స్వభావాల్లోనూ యింత పెద్ద మార్పు వచ్చాక, ఆ ధనం, నగలూ మీకు ముందు, ముందు ఎలాంటి హానీ చెయ్యలేవు. ఇక వెళ్ళిరండి!" అన్నాడు.

వీరప్పా, అనంతుడూ, అతడి భార్యా కొండ దిగి ఆనందంగా తమ, తమ గ్రామాల కేసి బయలుదేరారు.





# విఘ్నేశ్వరుడు

అక్కచెల్లెళ్ళు ప్రసన్నవదనా, మోహనా వరసగా విగ్రహాల్ని చూసుకుంటూ వెళ్ళి, నిరుత్సాహంగా మరలబోతూ, అవతల పిల్లల కోలాహలానికి ఆశ్చర్యంగా చూశారు.

"అక్కడ ఒక తక్కువ రకం రంగుల విగ్రహం ఉందిలెండి!" అంటూ ఎవరో అనడం వాళ్ళకు వినిపించింది.

అది విని మోహన, "పదవే, అక్కా! అదేదో తక్కువలోనే దొరుకుతుందిలా ఉంది!" అంటూ ప్రసన్నవదన చేయి పుచ్చుకొని అటు దారి తీసింది. అంతా ఆడా, మగా జనం ప్రదర్శనశాలలో ఒక్కరు మిగలకుండా వారిని వెంబడించారు.

ప్రసన్నవదన వెళ్ళి, వరహాల సంచిని విగ్రహం ముందు పెట్టి, తన మెడలోని పచ్చల రత్నాలహారాన్ని తీసి విచిత్రుడి చేతికి కంకణంలాగ చుట్టింది.

అది చూసి జనం, "వీళ్ళకేదో పిచ్చి ఉంది! అలాంటి గొప్ప విగ్రహాల్ని కాదని ఇక్కడ డబ్బు ధారపోస్తున్నారు!" అన్నారు.

ప్రసన్నవదన వాళ్ళతో, "ఇక్కడున్న విగ్రహంలో ఏ విశేషాన్ని చూసి పిల్లలంతా మురిసి ముచ్చట పడుతున్నారో, ఆ విశేషమే మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది. బాల దీవనలు బ్రహ్మదీవనలు, పిల్లలు దైవసమానులనీ అంటారు. అందుకే వారి ఎన్నికను శిరసావహించాము," అన్నది.



''మట్టి శిల్పంలో లేని రూపసౌందర్యాన్ని, సొంపుల్ని సామాన్యమైన జేగురు, సున్నము, బొగ్గు మొదలైన రంగులతోనే ఎంతో మూర్తివంతంగా తీర్చిదిద్దిన చిత్రకారుని ప్రతిభ అమోఘంగా వుంది. మా బహూకరణం అతి స్వల్పం!'' అని మోహన అన్నది.

ఆ సమయంలో, విచిత్రుడి వృద్ధజననీ జనకులు అక్కడికి వచ్చారు.

''నాయనా, పావనా! వాతాపి గణేశుడి కృపవల్ల మా అన్వేషణ ఫలించింది, ఇంత వాడివై కనిపించావు!'' అంటూ కుమారుణ్ణి కౌగిలించుకొని ఆనంద బాష్పాలు రాల్చారు. అప్పుడు విచిత్రుడు బాల్యం దాటుతున్న నవయువకుడు. తలిదండ్రులను చూసి మహదానందం పడ్డాడు. గతం అంతా గుర్తుకొచ్చింది. తన పేరేమిటో తెలిసింది.

వారి సమాగమాన్ని చూసి ప్రసన్నవదన తృప్తిపడుతూ, ''ఇప్పుడిప్పుడే మా కోరిక నెరవేరింది, మా మొక్కు చెల్లించుకొంటాము,'' అని చెప్పింది.

క్షణాలమీద జనం అక్కడ పెద్ద పందిరి వేశారు. విశాలమైన వేదిక అమర్చారు.

ప్రసన్నవదనవినాయకవిగ్రహాన్ని అంటిపెట్టుకు కూర్చుని తాళాలు వాయిస్తూ, ''తాండవ నృత్యకరీ గజానన....'' అని కీర్తన మొదలుపెట్టింది. వేదికపై మోహన విద్యుల్లతలాగ నృత్యం చేస్తూంటే, జనం పరవశించిపోతూ ఆనంద తరంగాల్లో ఊగిపోతున్నారు.

ప్రసన్నవదన గానం గజానన పండితుడికి వినిపించింది!

అప్పుడు గజాననుడు శతాధిక వృద్ధుడై ఇల్లు కదలలేని స్థితిలో ఉన్నాడు. అతనికి ఎక్కడలేని జవసత్వాలు వచ్చాయి. పరుగులాంటి నడకతో పందిట్లోకి చేరుతూనే ప్రసన్నవదనను చూసి చేతులెత్తి జోడించి సాగిలపడి అలాగే ధ్యానముద్రలో ఉండిపోయాడు.

నృత్యం చేస్తూ, చేస్తూ మోహన పెద్దదైన వినాయక విగ్రహాన్ని అవలీలగా భుజాని కెత్తుకొంది. అది చూసి తెప్పరిల్లిన జనం "అంత బరువు మోయలేవమ్మా!" అని అంటూంటే మోహన, "నాకు అల వాటేగా!" అని చెప్తూ విగ్రహాన్ని, భుజాన మోస్తూ, నాట్యం చేస్తూన్న నడకతో బయలుదేరింది. జనం అంతా ఆమె వెనకనే వెళ్ళారు. ఆ సందట్లో ఎప్పుడో అదృశ్యమైన ప్రసన్నవదన సంగతే ఎవరికి పట్టలేదు.

ధ్యానముద్ర నుండి గజాననుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా విగ్రహమున్నచోట మెరుస్తున్న వరహాలతో నిండుగా ఉన్న బంగారు జలతారు సంచి కనిపించింది. పాదాల చెంత విచిత్రుడు మోకరిల్లి కూర్చుని ఉన్నాడు.

గజాననుడు విచిత్రుడితో, "ఆలయ మంటప కుడ్యాలను గణేశలీలల చిత్ర శోభితం చెయ్యి! అందుకు కావలసిన ధనాన్ని ప్రసన్నవదనుడైన విఘ్నేశ్వరుడే అందించాడుగదా!" అంటూ లేచాడు.

గజానన విచిత్రులిద్దరూ ఊరేగింపుగా వెళ్తున్న జనంతో కలిశారు.

మోహన విగ్రహంతో ఆలయ పుష్కరిణికి చేరుకొని, తటాక సోపానాలు దిగుతూ మాయమై, ఆమెకు మారుగా చిట్టెలుక



విగ్రహాన్ని వీపున మోస్తూ నీటిలోకి పరుగు తీసింది. ఆ రోజే విగ్రహాల్ని జలనిమజ్జనం చేసే ఉత్సవదినం.

విగ్రహం తటాక మధ్యానికి చేరుకొని, కోటి పూర్ణిమల కాంతిపుంజంగా భాసించింది. ఆ కాంతిలో అభయ హస్తంతో ఆశీర్వదిస్తూ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించి, కనిపించి అంతర్థానమయ్యాడు.

గజాననుడు విచిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకొని, "నాయనా, పావనా! నీ మూలంగా వాతాపినగరానికి పావనత మిశ్రమమైంది. నీవు పావనమిశ్రుడివి!" అని చెప్పాడు, అంటూ పావనమిశ్రుడు ఆగకుండా, "గర్భాలయ ముఖద్వారం



మీది చిత్తరువు మహాభారత రచన....'' అంటూ చెప్పుకుపోతూంటే, యువ చిత్రకారుడు, ''గురుదేవా!'' అంటూ పావనమిశ్రుడి పాదాలను చేతులతో చుట్టి, ''మీ పావనచరిత్రను విన్న నేను ధన్యుణ్ణి! నా పేరు ఆనందుడు. మీ పావన నామాక్షరి మొదటి రెండు అక్షరాల్ని మార్చి, నా పేరు ముందు చేర్చి, 'వపానందుడు' అనిపించుకుంటాను. ఈ మంటపం పావన చిత్రాలయం! ఈ చిత్రాలకు ప్రతికృతులు రచిస్తాను. ముందు తరం వారికి మీరు చెప్పిన కథలన్నీ చెప్తాను. అనుగ్రహించండి!'' అంటూ శిరస్సు వంచాడు.

మెరుస్తున్న వెండి జుట్టుతో, ముడుతలుపడ్డ విశాల ఫాలంతో వార్ధక్యం పైబడ్డా మనసుకి ముసలితనం రానివ్వని పావనమిశ్రుడు యువకుడి తలపై చేత్తో ఆశీర్వదిస్తూ, మందహాసం చేసి మళ్ళీ చెప్పసాగాడు:

వ్యాసుడు తాను చెప్పబోయే మహాభారతాన్ని వ్రాయగల సమర్థుడు ఎవరా అని ఆలోచిస్తూండగా, బ్రహ్మ సాక్షాత్కరించి, విఘ్నేశ్వరుణ్ణి లేఖకుడుగా పెట్టుకోమన్నాడు.

బ్రహ్మ ఆదేశానుసారం వ్యాసుడు విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

విఘ్నేశ్వరుడు ప్రసన్నుడై, ''వ్యాసా! నీ ధోరణిలో నీవు చెప్పుకుపోతూండాలి, నా వంక చూడకూడదు సుమీ!'' అని చెప్పి వ్రాతకు కూర్చున్నాడు.

విఘ్నేశ్వరుడు తన దంతం ముక్కనే గంటంగా పట్టి, మోపినది ఎత్తకుండా వ్రాస్తున్నాడు. వ్యాసుడు అరమోడ్పు కన్నులతో ధ్యానమగ్నుడై చెప్తున్నాడు.

ఎదురుగా హిమాలయ శిఖరాగ్రం నుండి పడుతున్న జలపాతం మధ్యమావతి రాగంలాగ మంద్ర గంభీరంగా నేపథ్య సంగీతంలాగ శృతి పోస్తున్నది. దేవదారు వనాలు తలలూపుతూన్నవి. జలజల పారే నదాలు అనంతరాగమాలికలు ఆలా



పిస్తున్నవి. మహాభారత రచన ధారావాహికంగా, నిర్విరామంగా సాగుతూన్నది.

పుట్టుగ్రుడ్డి ధృతరాష్ట్రుడు హస్తినాపుర సింహాసనాన్ని అలంకరించాడు. తమ్ముడు పాండురాజు సామ్రాజ్య భారాన్ని మోస్తూ విస్తరింపజేశాడు. పాండురాజుకు పంచ పాండవులు, ధృతరాష్ట్రుడికి నూరుగురు కౌరవులూ పుట్టారు.

చిన్ననాటినుంచే కౌరవ పాండవుల మధ్య స్పర్థ, అసూయలు వర్ధిల్లాయి.

వ్యాసుడు చెప్తున్నాడు విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడు. సభాపర్వం సాగుతున్నది.

మయసభలో పరాభవం పొందిన దుర్యోధనుడు ప్రతీకారంగా పాండవుల్నీ వారి భార్య ద్రౌపదినీ జూదంలో గెల్చుకొని ద్రౌపదీ వస్త్రాపహరణ తలపెట్టాడు. భీముడు దుర్యోధనుడి తొడలు విరగ్గొడతాననీ, దుశ్శాసనుడి రక్తం తాగుతాననీ సింహగర్జన చేశాడు.

పాండవులు వనవాసం చేశారు. విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసం చేస్తున్నారు. సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని కీచకుడు అవమానించి భీముడి చేతిలో ముద్దయ్యాడు. ఉత్తరగోగ్రహణంలో బృహన్నల విజయుడయాడు. మహాభారతంలో సుందరకాండగా విరాటపర్వం సాగింది.

జలపాతం కళ్యాణిరాగం ధ్వనిస్తున్నది.

అభిమన్యుడికి ఉత్తరకు వివాహం జరిగింది. కృష్ణుడు రాయబారం వెళ్ళి పాండవులకు ఐదు ఊళ్ళు యిస్తే చాలన్నాడు. దుర్యోధనుడు సూది మొనపాటి నేల కూడా యివ్వనన్నాడు.

యుద్ధం అనివార్యమైంది. హిమాలయ ఝరి కదనకుతూహలరాగం ఆలపిస్తూ శిఖరాలు విరిగి పడుతున్నవా అన్నట్లుగా వడి హెచ్చి పడుతూన్నది. హిమానీనదాలు గుర్రాల్లా దౌడుతీస్తున్నాయి.

కృష్ణుడు అర్జునిడి రథసారథి అయ్యాడు. అర్జునుడికి భగవద్గీతను ఉపదేశిస్తున్నాడు. జలపాతం సామ సౌరాష్ట్ర దేవగాంధార రాగాలను వినిపిస్తున్నది.

భీష్ముడు అంపశయ్య చేరాడు. ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు. అభిమన్యుణ్ణి పదిమందీ కలిస్తే నేగాని చంపలేకపోయారు. సుభద్ర పుత్రశోకం లాగ జలపాత ధ్వని ముఖారిరాగంగా వినిపిస్తున్నది.

అర్జునుడు విజృంభించాడు ద్రోణుడి తల ధ్రుష్టద్యుమ్నుడు నరికాడు. అనేక అనర్థాలు సంతరించుకొన్న కర్ణుడిని నమ్ముకొని దుర్యోధనుడు కర్ణుడి చావుతో పూర్తిగా చిత్తయ్యాడు. భీముడు దుశ్శాసనుణ్ణి చంపాడు, దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టాడు.

జూదంలో ఓడిపోయిన ధర్మరాజు తమ్ములతో యుద్ధంలో విజయదుందుభి మ్రోగించాడు.

కృష్ణుడు అవతారం చాలించాడు.

పరీక్షిత్తుకి పట్టంకట్టి పాండవులు ద్రౌపదితో మహాప్రస్థానం బయలుదేరారు.

ధర్మానికి చావులేదు, చివరకు నిలబడేది ధర్మమొక్కటే అన్నట్లుగా ధర్మరాజు మేరుశిఖరాగ్రం మీద నిలబడ్డాడు.

జలపాత ధ్వని క్షీణిస్తూన్నది. అంతటా గంభీర నిశ్శబ్దం ఆవరించుకున్నది. వ్యాసుడు చెప్పింది విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడా? లేక విఘ్నేశ్వరుడు వ్రాసింది వ్యాసుడు చెపుతున్నాడా?




అన్నట్లు చకచకా భారత రచన సాగింది. సత్యలోకంలో పద్మాసనంపై బ్రహ్మ సంతృప్తిగా చిరునవ్వు చిందిస్తూ, సాభిప్రాయంగా సరస్వతి వంక చూశాడు. వెంటనే సరస్వతీదేవి వీణ మీటుతూ శ్రీరాగాన్ని పలికించింది.

మహాభారతం చెప్పడం పూర్తి కావస్తున్నది. చివరి పర్వంలో ఉన్నది.

సరస్వతీదేవి సత్యలోకంనుండి మంగళాచరణంగా శ్రీరాగం ఆలాపిస్తున్న వీణానాదం, తాను చెప్పుతున్న కథనానికి అంతరాయంగా వ్యాసుడి చెవిని సోకింది.

ఇంకా చెప్పవలసినది చాలా ఉంది. వ్యాసుడు ఆదమరుపుగా లేఖకుడి దెస

తేరి చూశాడు. మరుక్షణంలో విఘ్నేశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

మహాభారతం గ్రంథం మీద ఆకాశం నుండి అక్షతల్లాగ పువ్వులు జలజలా రాలాయి.

వ్యాసుడు ఆత్రంగా గ్రంథాన్ని విప్పి పరిశీలనగా చూశాడు. తాను ఇంకా చెప్ప దలచినదంతా ఒక్క అక్షరం తేడా లేకుండా సంపూర్ణంగా వ్రాయబడి ఉంది! వ్యాసుడు ఆనందాశ్చర్యాలతో పులకించి పోతూండగా, మహతివీణపై హంస ధ్వనిరాగం వినిపించింది.

నారదుడు వస్తూనే, "ఏమిటి మహాభారత మహర్షీ! ఆశ్చర్యపడిపోతూ చూసుకుంటున్నావు?" అన్నాడు.

వ్యాసుడు జరిగినది చెప్పాడు.

"అంటే, నీవు చెప్పేది చెప్పకుండానే, ముందుగానే నీ లేఖకుడు వ్రాసుకుంటూ వచ్చాడన్నమాట!" అన్నాడు నారదుడు.

"ఔను, నారదా! అదే జరిగింది. అటువంటి లేఖకుడు ఎలాటి తపస్సులు చేసినా ఎవరికీ లభించడుకదా! నేను ధన్యుణ్ణి! నా సంకల్పం జయప్రదమైంది! మహాభారతాన్ని 'జయం' అని కూడా పేర్కొంటున్నాను!" అని చెప్తూ వ్యాసుడు చేతులు జోడించి విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించాడు.

మహాభారతం దగ్గిర పెద్ద జ్యోతి పెరుగుతూ కనిపించింది.

ఆ జ్యోతి విఘ్నేశ్వరుని ఆకారంగా రూపొందింది.

విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి, "వ్యాస మహర్షీ! నీ మహాభారతం అద్వితీయ మహాకావ్యమై పంచమవేదంగా పరిగణింపబడుతూ కీర్తింపబడుతుంది!" అని, వ్యాసుణ్ణి ఆశీర్వదిస్తూ అంతర్హితుడయ్యాడు.

విఘ్నేశ్వరుని చేత అతని దంతపు గంటంతో లిఖింపబడి అక్షరసిద్ధి పొందిన మహాభారతం, అన్ని కాలాల్లో సారస్వతాకాశంలో చుక్కల్లో చందమామగా నిలిచింది.

—(సమాప్తం)





# వెర్రిబాగులవాడు

లెబనాన్ దేశంలోని ఒక గ్రామంలో హనీ, మరియం అనే భార్యా భర్తలు వుండేవారు. హనీ మంచివాడేగాని, కొంచెం మందమతి. అతను పనికి మొండి కూడానూ. మరియం మటుకు తెలివి గలదీ, సమర్థురాలూనూ. ఆమె భాగ్యవంతుల ఇళ్ళలో పాచి పనులు చేసి, తననూ, తన భర్తనూ పోషించుకుంటూ వుండేది. ఎక్కడికైనా వెళ్ళి, ఏదైనా పని చూసుకోమని ఆమె నిత్యమూ హనీని పోరేది. కాని హనీ ఆమె మాట ఏ మాత్రం పట్టించుకోక, చిన్నగా నవ్వి ఊరుకునేవాడు.

ఒకనాడు మరియం జబ్బుపడి పనికి వెళ్ళలేకపోయింది. ఆమెకు హనీ మీద చాలా కోపం వచ్చింది. "నువు ఏదైనా పనిచేసి డబ్బులు తీసుకురాకపోతే ఇద్దరికీ పస్తే! గ్రామపెద్ద వద్దకు వెళ్ళి, గాడిదను తోలే పని అడుగు. వాళ్ళ ఇంటి పనులు చూడడానికి అవసరం పడితే గాడిద మీద ఎక్కడికైనా వెళ్ళవలసివుంటుంది," అన్నదామె హనీతో.

మర్నాడు ఉదయం హనీ పెందలాడే నిద్ర లేచి గ్రామ పెద్ద వుండే భవనానికి వెళ్ళాడు. గ్రామ పెద్దకు హనీ అమాయకత్వం గురించీ, పెళ్ళాం అతన్ని పోషిస్తూ ఉండటం గురించీ పూర్తిగా తెలుసు. ఆయన హనీని చూసి జాలిపడి సహాయం చెయ్య సంకల్పించి, హనీ చేతిలో ఒక బంగారు దీనారం పెట్టి, ఒక గాడిదను కొనుక్కురమ్మన్నాడు. హనీ ఆ ప్రకారమే బీరూట్ నగరం వెళ్ళి, అక్కడి సంతలో మంచి బలంగల గాడిదను కొనితెచ్చి గ్రామపెద్ద వద్ద పని ప్రారంభించాడు. యజమాని అతనికి ఏ రోజు జీతం ఆ రోజు ఇస్తూ వచ్చాడు.



ఒకనాడు గ్రామ పెద్ద హనీతో, "నువు బీరూట్‌కు పోయి, ఫలానా దుకాణంలో ఒక బస్తాడు బియ్యం కొనుక్కురా," అన్నాడు.

ఆ దుకాణం హనీకి తెలుసును, కాని ఆ రోజు అతనికి మరీ బద్ధకంగా వుండి, బీరూట్‌కు పోబుద్ధి పుట్టలేదు. అయితే బియ్యం కొనుక్కురావటానికి గాడిదను మాత్రమే పంపితే తనకు శ్రమ తప్పుతుందని అతనికి తోచింది.

వెంటనే అతను గాడిద వద్దకు వెళ్ళి, "చూడు, మనకు బీరూట్ నగరంలో వాడుకగా బియ్యం ఇచ్చే దుకాణం నీకు తెలుసుకదా? ఆ దుకాణంలో ఒక బస్తా బియ్యం కొని, తీసుకురాగలవా?" అని అడిగాడు.

గాడిద తన తలను పైకీ కిందికీ అలవాటు ప్రకారం ఆడించింది. కాని హనీ మటుకు, తన మాటలు గాడిద అర్థంచేసుకున్నదనీ, తాను చెప్పినట్టు చేయటానికి ఒప్పుకున్నదనీ, అనుకుని చాలా సంతోషించాడు. అతను గాడిద తల మీద ఒక పాగా చుట్టిపెట్టి, దాని మడతలలో తన యజమాని ఇచ్చిన దీనారం వుంచి, గాడిదను బీరూట్ రహదారి మీద వదలి, అది కనుమరుగు అయిన దాకా చూసి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

తన భర్త ఆ వేళప్పుడు గాడిద లేకుండా ఇల్లు చేరటం చూసి అతని భార్య ఆశ్చర్యపడి, "బీరూట్ పోలేదేం? గాడిద ఏమయింది?" అని అడిగింది.

"గాడిదను ఒంటరిగా పంపాను. ముందు అడిగానులే! ఒంటరిగా వెళ్ళి, యజమానికి బియ్యం బస్తా కొనుక్కురాగలవా అని అడిగితే గాడిద కొనుక్కురాగలనని చెప్పి బయలుదేరింది," అన్నాడు హనీ భార్యతో.

"బుద్ధి తక్కువ దద్దమ్మా! ఎద్దు మొద్దు స్వరూపమా? నీ గాడిదా, దీనారమూ కూడా పోయాయి. దానికోసం

వెతుకు. వెంటనే బయలుదేరి, బీరూట్ రహదారి వెంటపో. గాడిదనూ, బియ్యాన్నీ వెంట తీసుకురాకుండా ఇంటికి మాత్రం రాకు!'' అని అతని భార్య చిందులు తొక్కింది.

హనీ ఇంటి నుంచి పరిగెత్తుకుంటూ వెళ్లి బీరూట్ రోడ్డు పట్టుకున్నాడు. ఆయాసంతో కళ్ళూ, నాలుకా వెళ్లుకొచ్చిన దాకా పరిగెత్తాడు. కాని అతనికి గాడిద కనిపించలేదు.

అతను బీరూట్ నగరం చేరి, వాడుక దుకాణానికి వెళ్లి, ''మా గాడిద వచ్చి మీ దగ్గిర బియ్యం కొన్నదా? ఇంతవరకూ అది ఇంటికి తిరిగి రాలేదు,'' అని బియ్యపు వర్తకుణ్ణి అడిగాడు.

బియ్యపు వర్తకుడు హనీ కేసి చూసి, అతను వెర్రిబాగులవాడని గ్రహించి, అతనితో హాస్యానికి దిగి, ''నిజమే, గాడిద ఈ ఉదయం వచ్చింది. కాని దానికి మా దుకాణంలో వున్న బియ్యం నచ్చలేదు. అందుచేత అది మరొక బియ్యం దుకాణానికి వెళ్ళింది,'' అంటూ ఆ దుకాణం చూపించాడు.

హనీ పక్కనే వున్న ఆ దుకాణానికి వెళ్ళాడు. ఆ సమయంలో మొదటి దుకాణం వాడు రెండో దుకాణం వాడికి సైగలు చేశాడు. రెండో దుకాణం వాడు వాటిని అర్థం చేసుకుని, హనీ తన దుకాణానికి రాగానే, '' ఏం కావాలి ?'' అని అడిగాడు.





హనీ మొదటి వర్తకుణ్ణి అడిగినట్టే రెండో వాణ్ణి కూడా, "మా గాడిద వచ్చి మీ దుకాణంలో బియ్యం కొన్నదా? ఇంత వరకూ అది ఇంటికి తిరిగి రాలేదు," అని అడిగాడు.

"అవునండీ, మీ గాడిద వచ్చింది. కాని దానికి బీరూట్ బియ్యం నచ్చలేదట. జాఫా నగరంలో బియ్యం బాగుంటుందని అక్కడికి వెళ్ళింది," అన్నాడు రెండో వర్తకుడు.

హనీకి కంగారు పుట్టింది. తాను జాఫాకు వెళ్ళి, గాడిదను తీసుకురాక తప్పదు. లేకపోతే మరియం ఇంట్లో అడుగు పెట్టనియ్యదు. అందుచేత అతను ఆ వర్తకుడి దగ్గిరే ఒక దీనారం అరువు తీసుకుని జాఫాకు వెళ్ళాడు.

అతడు జాఫాలో అంగళ్ళ ప్రాంత మంతా తన గాడిద కోసం వెతుకుతూ చెడ తిరిగాడు. గాడిద జాడలేదు. దారే పోయేవాణ్ణి ఒకణ్ణి ఆపి, ఆ నగరంలోకెల్లా పెద్ద బియ్యపు దుకాణం ఎక్కడో అడిగి తెలుసుకున్నాడు.

అతను ఆ పెద్ద దుకాణం ప్రవేశించి, "మా గాడిద మా యజమాని కోసం బియ్యం కొనడానికి ఇక్కడికి గాని వచ్చిందా?" అని అడిగాడు.

ఆ దుకాణం గల వాడికి ఆ నగరపు ప్రధాన న్యాయాధికారి పైన పాత పగ ఏదో ఉన్నది. హనీ ఇలా అడగగానే న్యాయాధికారి పైన పగ సాధించుకునే అవకాశం తట్టి, ఆ వర్తకుడు హనీతో చాలా స్నేహపూర్వకంగా, "కొంతసేపటి కింద మీ గాడిద మా దుకాణానికి వచ్చిన మాట నిజమే. అది బియ్యం ధర విషయమై నాతో బేరమాడసాగింది. దుకాణంలో గొడవ ఏమిటా అని జనం గుంపులు గుంపులుగా చేరారు నాతో బేరమాడడంలో మీ గాడిద తెలివి తేటలు చూసి, ప్రజలు ముచ్చటపడి, దాన్ని ప్రధాన న్యాయాధికారిగా నియమించారు. ఈ నిమిషాన అది మనిషి

వేషం వేసుకుని న్యాయస్థానంలో తీర్పులిస్తున్నది," అన్నాడు.

అంతేగాక వర్తకుడు హనీని న్యాయస్థానం వాకిలిదాకా వెంటబెట్టుకుని వెళ్లి, న్యాయాధికారి ఎక్కడ కూర్చునేదీ చెప్పాడు.

అయితే, పెద్ద హోదా సంపాదించిన తన గాడిద ఇప్పుడు తనవెంట పిలవగానే రాదేమోనని, హనీకి అనుమానం వేసింది. అందుచేత అతను వెళ్లి ఒక ముల్లంగి దుంపల కట్ట కొని, చప్పున న్యాయస్థానానికి తిరిగి వచ్చాడు. కాని ద్వారం వద్ద కాపలా వున్న వాడు అతన్ని లోపలికి వెళ్ళకుండా అటకాయించాడు. హనీ వాడితో తగాదా పెట్టుకున్నాడు.

న్యాయాధికారి ఈ పోట్లాట విని, అదేమిటని అడిగాడు. ఆయనకు హనీ గురించి తెలిసింది. ఇది బియ్యం దుకాణం వాడి పనే అయి ఉంటుందని ఆయన గ్రహించి, తన కోపాన్ని నిగ్రహించుకుని, హనీని లోపలికి రానియ్యమన్నాడు.

హనీ లోపలికి వచ్చి, తన చేతిలో ఉన్న ముల్లంగి కట్ట ఆడిస్తూ, "ఇది నా గాడిద. న్యాయాధికారి దుస్తులు వేసుకున్నది. దాని తలపాగాలో ఒక దీనారం కూడా దాచాను," అన్నాడు.

హనీ వెర్రిబాగులవాడని న్యాయాధికారికి తెలిసిపోయింది.

ఆయన అతనితో సౌమ్యంగా, "నీ గాడిదను ఎంత పెట్టి కొన్నావు?" అన్నాడు. హనీ ఒక బంగారు దీనారం పెట్టి కొన్నానన్నాడు.

న్యాయాధికారి అతనికి నాలుగు బంగారు దీనారాలిచ్చి, ఇక గొడవచెయ్యకుండా ఇంటికి వెళ్ళమన్నాడు.

బతుకుజీవుడా అని హనీ మరొక గాడిదను కొని, బస్తా బియ్యం కొని, దాన్ని గాడిద మీద వేసుకుని, తన యజమాని ఇల్లు చేరుకుని, బియ్యం ఆయనకు అందజేసి, తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఆ తరవాత అతను ఎన్నడూ గాడిదల మాట సమ్మలేదు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar — Chandrapal Singh

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కూర్చున్నా నీటికి!

రెండవ ఫోటో : వెళ్తున్నా ఏటికి!

పంపినవారు : మల్లిడ లక్ష్మిశ్రీదేవి, సూర్యబాగ్, విశాఖపట్నం-20

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

THE IX ASIAN GAMES, NEW DELHI 1982

# A burst of frolic!

NP

007

BUBBLE GUM

Treat yourself to
NP 007 bubble gum.
Savour its delicious flavour
and revel endlessly
with its bubble-power.
Bubble after bubble.




**THE NATIONAL PRODUCTS,**
Bangalore 560 032.

Pioneers in chewing gums and bubble gums.

*Beware of spurious and inferior Bubble Gums.*

Proven quality
certified by
IS:6747



విప్పండి, విప్పండి చిక్కుప్రశ్న.
అమ్మకోసం, నాన్నకోసం మరియు నాకోసం.

కెనరా బ్యాంకు ప్రకృతి క్విజ్

1. ఒకరకమైన ఎలుకలు ఆనకట్టను ఎందుకు కడతాయి?
2. పాములు తమ కుబుసాల్ని ఎందుకు విడుస్తాయి?
3. పిల్లి జాతికి చెందిన జంతువులన్నిటిలో ఒకే ఒకటి తన తెరచిన పంజాను వెనకకు తీసుకొనలేదు అది ఏది?
4. కొన్ని చేపలు ఈత మానినప్పటికీ మునిగిపోవు. ఎందుచేత?
5. బిర్రాఫిన్‌కు తాబేలుకు గల భేదమేమి?

ఓహో! తెలివైన పిల్లలకోసం.

నీవు మైనరు అయితే ఏం?

నీవు కెనరా బ్యాంకులో నీకొరకు ఒక ఖాతాను ప్రారంభించమని నీ తల్లికిగాని తండ్రికిగాని చెప్పు. నీవు పద్నాలుగేండ్ల వాడవైన వెంటనే నీవే ఒక ఖాతాను సొంతముగా ప్రారంభించి నడపవచ్చును. చిన్న మొత్తమైన అయిదు రూపాయలతోనే నేడే ఖాతా ప్రారంభించి ఆ ఆనందాన్ని నీవే పొందు.

విద్యానిధి : నీవు డాక్టరువి కావాలను కొంటున్నావా? లేక ఇంజనీరా?? లేక సైంటిస్టా??? అయితే దానికి జవాబు విద్యానిధి. నీ తల్లిదండ్రులతో నేడే ఒక ఖాతాను ప్రారంభించమని చెప్పు. నీ ఉన్నత విద్యాభ్యాసం ఏకూచింత లేనిదిగా వుంటుంది.

బాలక్షేమ : చురుకైన పిల్లలు తమ పాకెట్‌మనీ నంతటిని ఖర్చు పెట్టరు. కొంత కెనరా బ్యాంకు టి.వి. డాక్సుకోసం దాస్తారు. తెలివిగా ప్రవర్తించండి. మీ తల్లి దండ్రులను కెనరా బ్యాంకులో "బాలక్షేమ" ఖాతాను ప్రారంభించమని అడగండి. నాణేల్ని టి.వి. డబ్బాలో వేస్తూ అవి వృద్ధి చెందడం గమనించు. నీ కలలన్నీ నిజమవుతాయి.

# కెనరా బ్యాంకునుండి ఉచితం స్టిక్కర్స్

మీ బాలక్షేమ లేక మైనరు ఖాతా ఉన్న కెనరా బ్యాంకు శాఖనుండి స్టిక్కర్స్‌ను తీసుకొండి.



జవాబులు

1. ద్వీపాలలో తమ నివాసాల్ని ఏర్పాటు చేసుకొనేందుకు కృత్రిమమైన సరస్సులను నిర్మిస్తాయి
2. అవి తమ చర్మంకన్న ఎక్కువ పొడవుగా పెరుగుతాయి. పాములు తమ జీవితాంతం పెరుగుతుంటాయి.
3. చిరుతపులి.
4. వాటి ఈత తిత్తులు వాయువుతో నింపబడి చేపల్ని భారరహితంగా చేస్తాయి.
5. బిర్రాఫిన్ ఒక నిర్దుష్టమయిన రూపంలో నీటిలోను, భూమిమీద కూడ కనబడుతుంది.



**కెనరా బ్యాంక్**
(జాతీయ బ్యాంక్)